# విషాద భారతం

(సంపూర్ణ వచన కవితాకావ్యం)



సి. విజయలక్ష్మి





అభ్యుదయ సాహితీ ప్రచురణ
విజయవాడ

నవయుగ కవితా నాందీప్రస్తావకులు
మహాప్రస్థాన గీతాచార్యులు గురుతుల్యులు
వర్తమాన తెలుగు జాతి మహాకవి శ్రీశ్రీకి
వినయపూర్వక వందనాలతో........

అంకితం
విజయలక్ష్మి

# కృతజ్ఞత

అభ్యుదయ కవిత్వం పీడా విరగడైందని కలలుగన్న పెద్దన్నల కలల్ని కల్లలుగా జేసింది విషాదభారత కావ్యావతరణం. తెలుగు దేశంలోని అన్ని ప్రధాన దిన వారపత్రికలకీ కావ్యాన్ని సమీక్షార్థం పంపినా ఏవో వొహటి రెండు పత్రికలు మినహా అన్ని పత్రికలూ సామూహికంగా బాయ్‌కాట్ చేసి, కనీసం గ్రంథ స్వీకారమైనా వేసుకోలేదు. అందుకు ఆవగింజంత ఆశ్చర్యంగూడా పడవాలసిన అవసరమూలేదు. అయినా ఆంధ్రప్రజలు తమ హర్షాతిరేకాల్ని కుండపోతగా కావ్యంపై వర్షింపజేసి సమాదరించారు. ప్రజ గెలుస్తుంది. ఇల నిజం విలుస్తుంది. ఈ పరమసత్యాన్ని విషాదభారతం నిరూపించింది. అభ్యుదయ కవిత్వానికి దుర్దినాలు దాపురించిన ఈ పితపకాలంలో పట్టుమని పదిమాసాలు తిరక్కుపూర్వమే ఈ కావ్యం ద్వితీయ ముద్రణం జరుగుతోంది. ఈ అవకాశాన్ని లభింపజేసి తమ ఆదరాభిమానాల్ని చూపిన యావదాంధ్ర ప్రజానీకానికి నా హృదయపూర్వక ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

—సి. వి.

# ప్రాణాగ్ని

చచ్చింది, అభ్యుదయ కవిత్వం పీడా విరగడైంది, అనుకునే అన్నయ్యలకు ఉలికిపాటు కలిగించే విధంగా మరొక అభ్యుదయ కావ్యం– విషాద భారతం వెలువడుతున్నది. అభ్యుదయ కవిత్వం పుబ్బలో పుట్టి మఖలో గిట్టే మూన్నాళ్ళ ముచ్చట కాదని నిరూపించేందుకేమో ఈ కావ్యావతరణ!

ఈనాడు మన నాట జరుగుతున్న కపట నాటకం ఈ కావ్యానికి ఇతివృత్తమైంది. దేశ కాలాలను మీరినదే గొప్ప కావ్య మనుకొనేవారితో ఏమిగాని, దేశ కాలాలనుగురించిన కవిదర్శనమే కావ్యమనుకొనే ధోరణి ముమ్మూర్తులా అభ్యుదయ కవిని పట్టి ఇస్తుంది. ఇతరులనుంచి వేర్పరచి నిలుపుతుంది. దీనికి సిగ్గిల్లవలసిన పనిలేదు. ఏ కావ్యంలోనైనా దేశ కాల ప్రభావాలు అంతర్లీనంగానైనా ప్రత్యక్షం కాకపోవు. అభ్యుదయ కావ్యాలకైతే అవే జీవగర్రలు మరి! ఏ కావ్యంలో ఆ ప్రభావాలు ప్రతిభాసంపన్నంగానూ సౌందర్య సంపుష్టంగానూ ఉంటాయో అది మహాకావ్య మవుతుంది. ప్రత్యేక పరిస్థితులతో మనకేమిపని అనుకొని సార్వజనీన, సార్వకాలీన విషయాలే కావ్య ప్రసక్తాలు కావలెనని సిద్ధాంతం చేసుకొనేవారు లేకపోలేదు. వారిది నేలను విడిచిన సాము. ప్రత్యేక పరిస్థితులను సరిగా చిత్రించడంద్వారానే రచనకు సార్వజనీనత సిద్ధిస్తుందని అభ్యుదయ రచయితలు భావిస్తారు.

అభ్యుదయ రచయితలు, అభ్యుదయ రచయితలు అని పేరుబడిన వారు "రష్యా గుగ్గిలధూపంతో" మత్తెక్కినవారు కారు; ఏదో ఒక రాజకీయ పక్షానికి "తాళికులు" కారు. అట్లని రష్యానుగానీ చైనానుగానీ ఈసడించడమే తమ బ్రతుకుదెరువుగా చేసుకొన్నవారితో మమేకమూ కారు. అధికారంలో లేని రాజకీయ పక్షాన్ని కిందుచేస్తూ అధికారపక్షం కొమ్ముగాచేవారితోనూ ఇలాకా లేదు. అభ్యుదయ రచయితలు ఈ దేశంలో మన జనంయొక్క శ్రేయస్సుని ఆకాంక్షించేవారుమాత్రమే. అట్టడుగున నోరూ వాయీ లేక పడివుంటున్న వారికి ఉన్నతి కలగడమే వారి సాంఘిక ధ్యేయం. వర్గాలను వారు కానీ మరెవరు కానీ సృష్టించలేదు. మరి– వర్గాలుగా ఎడపెడలై ఉన్న మన సమాజంలో బాధలతో సతమతమౌతున్న ప్రజాకోటికి కవిత్వంద్వారాకూడా కొంత త్రాణ కల్పించి వారి సాంఘిక (అందులో భాగమే రాజకీయం) చైతన్యానికి మరింత పదునుపెట్టి సామాజిక వ్యవస్థను శుభ్రతరమూ న్యాయయుతమూ చేయడమే వారి ఆశయం.

ఈ దృక్కోణంనుంచి చూస్తే ఈనాటి అభ్యుదయ కవులకు గురువులూ, మార్గదర్శకులూ భల్లా పేరయ్య, గోగులపాటి కూర్మనాధుడు, వేంకటాచల విహార శతక కర్తవంటి అధిక్షేప శతక కవులు, వేమనవంటి లోక విమర్శకులు, ఇంకా ఇటీవలకి వస్తే చిలకమర్తి లక్ష్మీనరసింహం వంటి రాజకీయ పద్య కవులు, గరిమెళ్ళ సత్యనారాయణ, శెట్టిపల్లి వెంకటరత్నం, నెల్లూరి వెంకట్రామానాయుడు, కడపటికి నేటి కాంగ్రెసు నాయకుడు పి. తిమ్మారెడ్డి వంటి రాజకీయ గేయ కవులున్నూ, జాతీయోద్యమ సంరంభకాలంలో దువ్వూరి రామిరెడ్డి, రాయప్రోలు సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, ఉన్నవ లక్ష్మీ నారాయణ, త్రిపురనేని రామస్వామిచౌదరి, ఆంధ్ర రాష్ట్రోద్యమ సంరంభంలో తుమ్మల సీతారామమూర్తిచౌదరి కంటే ముమ్మందు తిరుపతి వేంకటకవులు ఇలా ఎందరినైనా పేర్కొనవచ్చు. వీరంతా ఆ కాలానికి అప్పటి దేశ పరిస్థితికి తగిన ప్రబోధ, అధిక్షేప, వ్యంగ్య ఖండన కావ్యాలను రచించినవారే. వారి చాలులోనిదే అభ్యుదయ రచనా సంప్రదాయం !

ఈ సంప్రదాయం ఇటీవలి కాలంలో కాస్త నిస్తేజమైంది, నిజమే. మంద గించిన కవులు మందగించగా, ముద్దుబారిన కవులు ముద్దుబారగా, జారిపోయిన కవులు జారిపోగా, ఎప్పటికప్పుడు కొత్త అభ్యుదయ కవులు గొంతు విప్పుతూనే ఉన్నారు. వారిలో, గజ్జల మల్లారెడ్డి తర్వాత చెప్పుకోదగిన అభ్యుదయ కవి యీ కావ్యకర్త.

వీరిని పరిచయం చేయనక్కరలేదు. సి. విజయలక్ష్మి అనే పేరు చూడగానే ఎంతోకారం అంగారం ధట్టించిన గేయం చదవబోతున్నామనే సంతోషం పాఠకు లకు ఈనాడు కలుగుతున్నది. ఈపాటికే వీరికి పాఠకుల హృదయాలలో తనదని చెప్పుకోదగిన స్థానం చేకూరివుంది.

ఇది కవిత్వం కాదు, 'కసిత్వం' అని నిర్వర్ణించే విమర్శకులు ఇంకా ఉన్నారు. ఎప్పుడూ వుంటారు. వారు "కపిత్వం" అనేదానికి పెట్టుకున్న ముద్దు పేరే "కవిత్వం". అలాంటి "కపిత్వం" ఇందులో లేదని నాతోబాటు (బహుశా నాకంటే సిద్ధంగా) ఈ కావ్యకర్త అంగీకరిస్తారు. పూవుల్లేవు, తావుల్లేవు, సంజల్లేవు, సంగీతాల్లేవు, నగిషీలు లేవు, నాణ్యాలు లేవు, భాషాటోపాల్లేవు, అలంకారాల కుచ్చుల టోపీల్లేవు- అయినా కవిత్వం ఉంది. పైవన్నీ వుండీ కవిత్వంలేని నీరస రచనలు లేకపోలేదు. హృదయ నిర్భరత్వం కవిత్వానికి కావలసిన ద్రవ్యం. మాటలూ, మాటల కూర్పులూ, గణాలూ, మాత్రలూ- ఇవన్నీ ఉపాంగాలు మాత్రమే. ఆ ఉపాంగాలు ఏ కావ్యంలోనైనా ఇంతో అంతో ఉంటాయి. అయితే, కావ్యభాషనే వాడవలెననిగానీ, వృత్తరచనే చేయవలెనని

గానీ నియమాలు ఈనాడు చెల్లుబాటులో లేవు. కడపటికి ఈ కావ్యకర్తకు ఆధునిక గేయకవుల అంత్యప్రాసానియమంగురించికూడా సదభిప్రాయంలేదు. తానైదానిని పాటించనూలేదు. అంతమాత్రాన వీరు కావ్యకర్తగాకుండాపోతారా ?

"కవిత సరిహద్దుల్ని నిర్ధరించడం
గగన పరిధిని స్కేలుబద్దతో కొలవ ప్రయత్నించడం."

అంటున్నారు. కవిత్వమనేది ఎంత చిరంతనమో అంత నవీనం. దానిని నిబంధించే గట్లులేవు. కవిత్వానికి కావలసింది కవి పక్షాన హృదయానుభూతి. దానిని పాఠకునికి చేరవెయ్యగలిగితే చాలు; కవి శబ్దం సార్థకమైనట్లే.

ఈ కావ్యకర్త ఉగాదినాడు వేపపూతనూ, మామిడిచెట్టు చిగుళ్ళనూ కోకిలాలాపాలనూ సంవత్సరం సంవత్సరంపత్రికలకు సరఫరాజేసే రకంకాదు. ఆ నాయకుడిజన్మదినాలకూ ఈ నాయకుడి మరణవేళలకూ మంత్రాలుచెప్పరు. పొగడ్తల పూలమాలలతో వినాయకుల అలంకరించరు. వీరికి కవిత్వం "త్రినేత్రం" బాధనుంచి కవిత్వం, బాధనుగురించి కవిత్వం. బాధలోనుంచి కర్తవ్యబోధ.

ఈ కావ్యాన్ని చదువుతూంటే, నాదేశం నా కాలం నాకు కళ్ళకు కట్టినట్లయింది. నా మనుషులు నాతో మాట్లాడుతున్నట్లనిపించింది. కావ్యకర్త తాను కరిగారు. నన్ను కరిగించారు. దేశంలో పెచ్చరిల్లిపోతున్న నిరంకుశ ధోరణులు, ఓట్ల పండగలో జరిగే దగాలూ దౌర్జన్యాలూ, కొండెక్కుతున్న జీవన సౌఖ్యాలను ఎగసనదోసే తెన్నుగానక తిరుపతులకూ అన్నవరాలకూ పుటపర్తులకూ చేస్తున్న యాత్రలు, డబ్బుకక్కుర్తికి పౌరసత్వాన్ని అమ్ముకోవలసి వస్తున్న వైపరీత్యాలు- విషాదం మూర్తీభవించిన భారతదేశం ప్రత్యక్షమౌతున్నది. స్వరాజ్యలక్ష్మి మాచకమ్మగా పరిణమించినప్పటి బాధ, కావ్యకర్తనీ నన్నూ ఏకం చేయగలుగుతున్నది. ఈ బాధే కావ్యకర్తచేత పరుషవాక్యా లాడించింది: అసభ్యాలని "మర్యాదస్తు" లనుకొనే పదాలనుగూడ నోట బెట్టించింది.

ఈ కావ్యకర్త పట్టి సాహిత్యోపజీవి అయితే ఈ కావ్యం ఇలా గుండేది కాదు. ఐన్‌స్టీన్ మొదలు అప్పలాజు అభినవ కృష్ణావతారం వరకు, ప్రోటాన్ మొదలు పందులగూడెం ప్రసక్తివరకు - ఆధునిక వైజ్ఞానిక, సాంఘిక విషయ జ్ఞాన సంపత్తి, ఈ కావ్యకర్త ఇచ్చాను వర్తిలాగుంది- శుష్కరాజకీయ విషయ లంపటత్వం, వీరి ఆశయంకాదు. రాజకీయ నేతృత్వంకూడా వీరికి ఉంది. ఓటు "చట్టబద్ధమైన తిరుగుబాటు" "నిరంతర జాగరూకతే స్వాతంత్ర్యానికి చెల్లించవలసిన మూల్యం" అనగలిగిన వ్యక్తి, సామాన్య వ్యక్తిమాత్రం కాదు. వాడిన మాటలు మోటు మాటలనిపించవచ్చు. అయితే ఆ మోటుతనమే ఈ కావ్యానికి బలమని నేననుకుంటున్నాను. అవి జనం మాటలు. అవే పనికిరాకపోతే, మరేవిపనికి వచ్చేటట్లు ? వాటిలో జాతిగుండె కొట్టుకొంటూ ఉందిమరి !

తనకున్న విద్యాధికత్యను బట్టబయలు చేసుకొంటూ బడాయీలకు పోకుండా, తన సంస్కారానికి లాం కోటూ టాప్ హేటూ పెట్టి హెచ్చులు చూపకుండా, తన వ్యక్తిత్వాన్ని లోకంపై రుద్దకుండా, బాధపడుతున్న సామాన్య జనంతోటి మనసా వాచా ఐక్యతను సాధించిన ఈ కావ్యకర్తని మెచ్చుకోకుండా ఉండటం ఆత్మద్రోహమేగాక, స్వజాతిజనులకు ద్రోహమని నామట్టుకు నేనను కుంటున్నాను. తెగిడేవాళ్లు, తప్పు లెన్నేవాళ్లు ఉంటే ఉంటారు. వారి కూటమి, వారి చేరిక, మరోవర్గానివి కదూమరి? వారి ఆశీర్వాదాలూ, ధన్యవాదాలూ లాగే వారి అభిశంసనలూ విమర్శనలూ అక్కర్లేదు. ప్రజామోదమే అభ్యుదయ కావ్యాలకు కావలసిన మొహరు. అది ఈ కావ్యానికి తప్పకుండా ఉంటుంది.

కావలికళాశాల
కావలి.
14-7-65

కె. వి. రమణారెడ్డి

# "విషాద భారతం" కావ్య పరామర్శ

[విషాద భారతం రచయితకు శ్రీ సోమసుందర్ రాసిన బహిరంగలేఖ విశాలాంధ్ర 1965 డిసెంబరు 28 వ తేదీ సంచికలో ప్రచురింపబడింది. కావ్యాన్ని పరామర్శించడం మాని, కావ్యకర్తని వెనకనించి వెన్నుపోటు పొడిచేందుకు శ్రీ సోమసుందర్ ప్రయత్నించారు ఆ జాబుకు జవాబును 26-1-66 నాటి జనశక్తి సంచికలో శ్రీ ఆర్. వి. రామిరెడ్డిగారు ఇచ్చారు. ప్రధానంగా సాహిత్యాన్ని గురించీ, కవితారీతులను గురించీ ఆ జవాబు కొంతవరకు సమగ్రంగా ప్రస్తావించినందున దానిని పాఠకుల సౌకర్యార్థం కావ్యంలో చేరుస్తున్నాం-ప్రచురణ కర్తలు]

## I

శ్రీ సోమసుందర్ గారికి,

26-12-5 నాటి విశాలాంధ్ర పత్రికలో మీరు విషాద భారతంపై రాసిన ఉత్తరాన్ని చదివాను.

ఎవరో హిమాలయ పర్వత శిఖరాన్ని అధిరోహించ బోతున్నారని, తానూ తాటి చెట్టెక్క బోయి బోర్లగిలా పడ్డవాడి చందంగా వున్న మీ జాబులోని దుగ్ధనీ, సాయంత్రం విషాదభారత కావ్య పఠనం ప్రారంభించి, తెల్లారేప్పటికల్లా వ్యాఖ్య రాసేయాలనే మీ 'దుర్ధానీ' నేనర్థం చేసుకోగలిగాను! నాకు తెలిసినంతలో కవితా రచనకీ, అంతకన్న ముఖ్యంగా సాహితీ విమర్శనకీ ఉపక్రమించ బోయేముందు ఇంత ధ్యానం, మౌనం, అత్యంత ప్రధానం. అది కంచుకాగడా బెట్టి గాలించినా కలికానికైనా మీ జాబులో కనిపించలేదు!

మీరు విషాదభారతంపై చేసిన అసంబద్ధ వాదనలవంటివాటిని, అప్పకవీయాన్ని వల్లెవేసిన ఒక ముసలి అలంకార శాస్త్ర పండితుడు చేస్తే జాలిగా నవ్వి ఊరుకొనేవాణ్ణే! కాని, అభ్యుదయ సాహితీ చరిత్రలో ఉత్తమ అధ్యాయాన్ని సృష్టించిన వజ్రాయుధం రచయిత, మాజీ అభ్యుదయ కవియే హేతుబద్ధమైన సాహితీ విమర్శా సాంప్రదాయానికి ఒద్ధవిరుద్ధమైన వాదనల్ని చేస్తోంటే, ఏడవాలో నవ్వాలోకూడా అర్థంగాకుండావుంది! మాజీ అభ్యుదయకవి అనే పద ప్రయోగం ఉక్తి వైచిత్రికోసంగాక ఉద్దేశపూర్వకంగానే ఉపయోగించినందుకు ఆగ్రహించక అనుగ్రహించండి! తడిగుడ్డబెట్టి గొంతులుకోసే కౌటిల్యరీతి, తేనెపూసిన కత్తి

లాంటి సాహితీ విమర్శారీతి ఈ జవాబులో మీకు ద్యోతకం కావు. అంచేత, ఈ జవాబు కొంచెం కర్కశంగానే వుండవచ్చు. ఈ కర్కశత్వాన్ని, మీరు మీ జాబులో ప్రదర్శించిన సంగనాచితనంగాగాక, చిత్తశుద్ధిగల సాహితీ విమర్శగానే దయచేసి స్వీకరించండి.

## మీ ప్రయోజనం సాహిత్యేతరమా ?

"గద్యకవితల నిండా స్త్రీలు బహిరంగంగా మాట్లాడుకోడానికి సిగ్గుపడే నేటి సామాజిక కల్మష విషయాలను బహిరంగంగా యథేచ్ఛగా వర్ణించారనీ." "కర్తృత్వ నామధేయానికీ, కవితావాణి ద్యోతకంచేసే కవిహృదయ తత్వానికీ ఎక్కడా లంగరు కుదరడం" లేదనీ, మీరు విషాద భారత కావ్యకర్తపై అభియోగం మోపారు. అజ్ఞాతనామంతో వ్రాయడం నైతిక అపభ్రంశమని గూడా సెలవిచ్చారు. ఇదే నిజమైతే, వర్ధమాన అభ్యుదయ కవులూ, కవయిత్రులూ చివరికి నేటి "దిగంబర కవులు" సైతం, నైతిక అపభ్రంశానికి పాల్పడుతున్నారని మీరు భావిస్తోన్నారా ? ఇంతకీ మీ జాబు-విషాద భారత కావ్యకర్త వ్యక్తిగత వివరాల పరామర్శా-లేక-ఆ కావ్యంపై విమర్శా ? ఈ రెంటిలో మీ జాబు దేన్నిగూర్చి చర్చించినట్లు ? సాహితీ విమర్శలో పసలేనప్పుడు వ్యక్తిగత దూషణకీ, రంధ్రాన్వేషణకీ దిగడం పరిపాటి. ఆ పనే మీరు మీ లేఖలో చేశారు. విషాద భారతం లోని చిత్రణ వర్తమాన సామజిక వాస్తవాలకి దగ్గరగా వుందాలేదా ? ఆ రచన సామాజిక దౌష్ట్యాలను పాఠకుని ముందుబెట్టి అతనిచే ఆలోచింప చేయగలుగుతుందా లేదా అనేదే ప్రధాన సమస్య. కాని, ఇది మీ కసలు పట్టనేలేదు ! కారణం- మీ లేఖా ప్రచురణ ద్వారా మీరు ఆశించిన ప్రయోజనం సాహిత్యేతరం !

## అజ్ఞాతనామంతో రచనలు చేయరాదా ?

స్త్రీగానీ, పురుషుడుగానీ, ఒక రచయిత, అజ్ఞాతనామంతో రచన చేస్తే, ఆ రచయిత విజాయితీనీ, చిత్తశుద్ధినీ, ఫ్రాంక్‌నెస్‌నీ సిన్సియారిటీని శంకించవలసిన పరిస్థితివుందా ?! సొంత పేరుతోనే ప్రచురించమని రచయితలకి మీరు "ఉదారమైన" సలహా యివ్వడం, జీవనోపాధికోసం చేస్తున్న ఉద్యోగాలకి ఉద్వాసన చెప్పించి, ఊడగొట్టిన మంచం కోళ్ళుగా తయారుచేసి, చేస్తోన్న ఆ కాస్త సాహితీ కృషిగూడా చేయకుండా మలమల మాడిచస్తే బాగుంటుందనే ఉద్దేశంతోనా స్వామీ ? ! ఇంగితజ్ఞానం లోపించిన మూర్ఖుడు సైతం చేయ సాహసించని ఇలాంటి వాదన ద్వారా మీరు ఏ అపూర్వ ప్రయోజనం సాధించ జూస్తున్నారో సెలవిస్తారా ? ? లేక- "తామే యుగకర్తలమని, తమదే సాహిత్యమని తప్పెట్లు కొట్టుకొనేందుకు" విషాదభారత కావ్యకర్తా, వర్ధమాన అభ్యుదయ

కవులూ, కవయిత్రులూ మీ కీర్తి సౌధపునాదులను తవ్వేస్తారేమోననే భీతితోనా? విశాలాంధ్రలో ప్రశాంత, మైత్రేయ, ఆదిత్య, లావణ్య, భామ, యిత్యాది అజ్ఞాత నామాలు ధరించి, రచనచేసే వారందరి నిజాయితీనీ శంకించుకుంటూ పోతే, ఇహ తెలుగు సాహితీలోకంలో, నిజాయితీకి, చిత్తశుద్ధికీ, మీరే పరమ సంకేతంగా నిలుస్తారు! అద్వైత సిద్ధాంతంలోని రజుస్సర్ప భ్రాంతిలా ఈ వితండతర్కం నాకు అంతుబట్టడంలేదు! అంతేకాదు-మీవలె ప్రతి రచయితా, అగర్భ శ్రీమంతుడుగా జన్మించలేదనే సత్యాన్ని గూడా మీరు గుర్తించడం చాలా అవసరం!

## పదాల ప్రయోగ సమస్య

"స్త్రీ మనస్తత్వానికీ, లాలిత్యానికీ భంగకరమైన పదాలు, పద చిత్రాలు, వర్ణనలు." "విషాదభారత" కావ్యకర్త చేశారని మరో అభియోగం! దీనిలో ఎంత పాలు లాజిక్, మరెంత పదాల మ్యాజిక్ వుందో నాకు అంతుబట్టడంలేదు! గీత గోవిందంలోని సంస్కృత శ్లోకాల్ని "గౌరవనీయ కుటుంబానికి చెందిన తెలుగు ఆడపడుచు"లే అర్థతాత్పర్య సహితంగా చదివి లొట్టలువేస్తోంటే తప్పు లేదు! అన్నమాచార్యుల సంకీర్తనలను, క్షేత్రయ్య పదాలనూ, భరతనాట్యాలూ భామాకలాపాలరూపంలో పాడుతూ లజ్జుగా అభినయిస్తే ఫరవాలేదు! "చక్కగా మరుకేళి సొక్కియున్నవేళ నను బ్రోవమని చెప్పవే సీతమ్మతల్లీ" అంటూ, "గౌరవనీయ కుటుంబాల ఆడపడుచులుగా" మీరు పరిగణించేవారే శనివారం రాత్రిళ్ళు దిబ్బరొట్టి సేవించి, గుళ్ళల్లో, సాయిబాబా భజన మండలులలో చెక్క భజన జేస్తే దోషం లేదు! గోపీ పీనపయోధర మర్దనాన్నీ, రాధా మాధవ విగళిత వస్త్ర విలాసాల్నీ, ఉక్తి వైచిత్రితో, సుతిమెత్తని రంకు సంస్కృత పదజాలంతో జయదేవుడు గీత గోవిందంలో వర్ణించిన శ్లోకాల్ని "గౌరవనీయ కుటుంబాల ఆడపడుచులే" అకుంఠిత "భక్తిజ్ఞాన వైరాగ్యాలతో కంఠతా పడుతోంటే, నోరు మెదపలేని మీరు విషాద భారతంలో స్త్రీ మనస్తత్వానికి భంగకరమైన పదాలూ, పదచిత్రాలూ కనిపించాయని ఆగ్రహిస్తోన్నారా?! ఊహా యమునా సైకత స్థలాల్లో, వెన్నెల వాకల్లో, తేనెజల్లుల్లో, ప్రేయసి జంఘల్ని స్పృశించి మయూర నాట్యాల్లో మంజుల వేణుగానాల్లో స్నాతులై పులకరించి, పరవశించి కమ్మని కలలుగని, వైష్ణవభక్తి నరనరాల్లో వెల్లువగా (చూడు-సోమసుందర్ "మిణుగురులు" కావ్యానికి శశాంక పీఠిక) గీతాంజలి కవితకి నూతాపన్నెండో కార్బనుకాపీతీసి, ఆత్మ పరమాత్మల ఐక్యసంధానమనీ, దాసీస్వాముల అనుబంధమనీ, తమ "మిణుగురు" పురుగుల కవిత్వానికి అందంగా ఒక బిళ్ళ తగిల్చి, "మధురభక్తి" గీతాలనే ముద్దు పేరుబెట్టి, ఎన్నడో గడించిన వజ్రాయుధం కీర్తి పెట్టుబడితో కవిగా చలామణీ

అవుతోన్న మీకు, విషాదభారతంలోని వర్ణనలు అసహ్యకరంగా కనిపించడంలో లేశమంత ఆశ్చర్యమైనా లేదు।

## పాత్రలు వాడిన మాటలు రచయితకు అంటగట్టదగునా?

శ్రీమతి ముప్పాళ్ళ రంగనాయకమ్మ గౌరవనీయురాలైన తెలుగు ఆడపడుచు. ఆమె "కృష్ణవేణి" అనే నవల రాసింది. ఆ నవలలోని కథానాయిక కృష్ణవేణి, తన ప్రియునికి ఎన్నో ప్రేమలేఖలు రాస్తుంది. ఆ లేఖల్లో కొన్ని సందర్భాల్లో బరితెగించిన, పరిమితిదాటిన కాముక వర్ణనలున్నాయి. అవివాహితగా వున్న కృష్ణవేణి యౌవనోద్రేకంలో తన ప్రియునికి అలాంటి లేఖలు రాయడం, వాస్తవపాత్ర చిత్రణకి నిదర్శనం. అంతేగాని, రంగనాయకమ్మవంటి గౌరవనీయురాలైన తెలుగు ఆడపడుచు అలాంటి లేఖలూ, ఆ విధమైన కాముక శృంగార వర్ణనలూ ఎలా చేయగలిగిందని ఏ మూర్ఖుడైనా అంటాడా?? సుప్రసిద్ధ అమెరికన్ రచయిత్రి పెరల్‌బక్ నవలల్లో అలాంటి వర్ణనలు లేవా? అంచేత, హేయమైన సెక్సు వర్ణనలద్వారా పాఠకుల తుచ్ఛ కామోద్రేకాన్ని రెచ్చగొట్టి, తద్వారా కాసులు జేసుకొనే సెక్సు పత్రికా రచయితలపై చేయవలసిన విమర్శను మీరు సందర్భశుద్ధి లేకుండా విషాదభారత కావ్యకర్తపై చేస్తోన్నారు।

షేక్స్పియర్ హేమ్లెట్ నాటకంలో- నాయకుడైన హేమ్లెట్ తన తల్లితో మాట్లాడుతోన్నప్పుడు తన తల్లి చంచల మనస్కతనీ, నైతిక పతనాన్నీ చూసి, ఆగ్రహోదగ్రుడై, "ఓ స్త్రీ నీ పేరు చాంచల్యం" అని అంటాడు. ఆగ్రహ పరవశుడైన హేమ్లెట్ అన్న మాటలు కావ్యకర్త అయిన షేక్స్పియరే అన్నాడని ఏ మూర్ఖుడైనా అనగలడా? విభిన్న పాత్రలను విభిన్న మనస్తత్వాలతో సృష్టించే కవి, ఆ యా పాత్రల మనస్తత్వాలనూ, భాషనూ బట్టి ఆయా సన్నివేశాలకి తగినవిధంగా జీవం పోస్తాడు. అలా గాకపోతే, మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులు బిచ్చగాడితో, "తండులంబులు నిండుకొన్నవి" అని మాట్లాడిన చందంగా వుంటుంది. ఒక ప్రత్యేక పాత్ర, ఏ సన్నివేశంలో ఏ తీరుగా మాట్లాడాలో ఆ తీరుగా మాట్లాడినప్పుడే వాస్తవికత వుంటుంది. కాకుంటే పాత్ర చిత్రణ, సంభాషణ, అభాసుపాలై పాఠకుల నోట్లో ఊస్తారు. కన్యాశుల్కం నాటకంలో గిరీశం, రామప్పంతులూ అన్న మాటల్ని అప్పరాయకవీంద్రులకి అంటగట్టుతామా?? నవ్యాంధ్ర నాటకచరిత్రలో మహోజ్వల అధ్యాయాన్ని సృష్టించిన "మా భూమి" నాటకంలోని పాత్రలు- వాడిన మాటలు, సుంకర- వాసిరెడ్డి రచయితలకి అంటగట్టుతామా?

## 14

# కడుపు మండితే వచ్చే మాటలవి

వాగ్దానాల చెల్లింపులతో పీళ్ళతిరబడిగా తమ పబ్బం గడుపుకుంటూ, ఎన్నికల ప్రచార సమయంలో తగుదునమ్మా అంటూ తయారైన బహద్దరు—

"పాడుబడ్డ గుళ్ళకీ మూలబడ్డ మసీదులకీ వెల్ల వేయిస్తాం
భూసంస్కరణలు అమలు జరిపించి
బంజర్లూ బుల్‌డోజర్లూ పంచేస్తాం"

(విషాద భారతం, పేజి : 16)

అంటూ లేతలేత సొరకాయల కోస్తొంటే ఒళ్ళు భగ్గున మండిన ఒక శాస్త్రుర్లుగారు—

"తింటానికి కూళ్ళేదు బుల్‌డోజర్లిస్తారంట ! బుల్‌డోజర్లు ఉపస్థమినహా కన్యాదాన మన్నట్లు" అని అంటాడు. ఈ మాట అన్నది విషాదభారత కావ్యకర్తా లేక శాస్త్రుర్లుగారా ? ! కావ్యంలో ప్రస్తావించబడిన ఎన్నికల ప్రచార సన్నివేశానికీ ఈ తెలుగు జాతీయం అంకేడిగా వుందా లేదా అనే మీమాంసకి బదులు ఒక రచయిత్రి యిలాంటి పదప్రయోగం చేయడం స్త్రీ మనస్తత్వానికీ, లాలిత్యానికీ విరుద్ధం గాదా అని ప్రశ్నించడం అసమంజసం, అర్ధరహితం, అవివేకం. అంతే గాదు; కావ్యగత పాత్ర అన్న మాటల్ని కావ్యకర్తకి అంటగట్టడం సాహితీ విమర్శా చరిత్రలోనే అపూర్వం. మానవ మనస్తత్వ పరిశీలనా రాహిత్యానికి నిదర్శనం. ఈ మాట కావ్యకర్త అనలేదు. అంచేత, అంటున్నట్లు నటించడమనే సమస్య అంతకన్నా లేదు. అసలు ఉత్పన్నం కాదు ! కావ్యాన్ని పరామర్శించడం మాని, కావ్యకర్తను వ్యక్తిగతంగా దూషించడం, సాహితీ విమర్శా సాంప్రదాయ లో అత్యంత నీచమేగాక శోచనీయం. కావ్యకర్త వ్యక్తిగత వివరాలలోకి పోయేందుకు ప్రయత్నించిన మీరు ఏమీ ఎరగనట్లు నటిస్తూనే ఆ వివరాల ప్రస్తావన తెచ్చారు.

"ముద్దీ నోటా" అనే పదప్రయోగం చేయడం "గౌరవనీయం"గా లేదని మీ రన్నారు ! విశ్వరూప సందర్శన పర్వంలో (పేజీ 35)

"సారా పీపా చుట్టూ మూగారు
మట్టి మూకుళ్ళలో గొడ్డుమాంసం వొడ్డించారు
వొళ్ళూపై తెలీకుండా వాళ్లు తాగి తందనా లాడారు
బహద్దరు ఏరేంజి జేసిన సెక్సుబ్రెడ్డూ సారా వాటరూ
జనాన్ని ముద్దీ నోటా ముంచెత్తాయ్ ! ! !"

అని కావ్యకర్త ఎన్నికల జాతరను పరమ నగ్నంగా, అత్యంత ప్రతిభా వంతంగా, వాస్తవికంగా వర్ణించారు. పంచాయితీ ఎన్నికల దగ్గరనుండి,

సమితులు, జిల్లాపరిషత్తు, ఎసెంబ్లీ, పార్లమెంటు ఎన్నికలవరకూ ఎలక్షన్ జాతర జరుగుతోన్న కాలంలో పామర జనాన్ని మోసంతో ఆకట్టుకొనేందుకు ప్రజా ప్రతినిధుల వేషాలు ధరించిన పయోముఖ విషకుంభాలు, భారత ప్రజాతంత్రం గూడులోపల సాలీడులు పేదప్రజలకి కల్లూ, సారా ముడ్డీ నోటా పోసి, ముంచెత్తి తమ పబ్బం గడుపుకోవడం మీకు "గౌరవనీయం"గానే వుందా స్వామీ?!!! నేడు మనందరి కళ్ళముందు జరుగుతోన్న నగ్న సత్యాలనిగూర్చి చెప్పితే తప్పా? "పెద్దవాళ్ళు" చేసే పనులు తప్పా! లేక వాళ్లు ఆ పనులు చేస్తున్నారని చెప్పడం తప్పా? ఏది తప్పు? మరేది ఒప్పు?! ఎన్నికల జాతరలోని ఈ జుగుప్సాకర వంచనాత్మక పరిస్థితినిగూర్చి చెప్పేప్పుడు ఈ పదం తప్ప మరో పదం వాడితే భావ వ్యక్తీకరణ జరుగుతుందని నే ననుకోను. అంచేతనే రెండు దశాబ్దాలనుండి అభ్యుదయ సాహిత్యోద్యమంతో సంబంధమున్న సుప్రసిద్ధ రచయిత, సాహితీ విమర్శకుడైన శ్రీ కొడవటిగంటి కుటుంబరావు విషాద భారతంపై అభిప్రాయం చెప్తూ "విషాద భారతంలో నాకు బహుముఖ పరిజ్ఞానంతోబాటు పదునైన పలుకుబడికూడా కనిపించింది. రచన ఘాటుగానూ అందరికీ తలకెక్కేదిగానూ ఉంది. కవిత్వం గురించి చెప్పే శక్తి నాకు లేకపోయినా నా బుద్ధికి ఆ యాస్పెక్టుకూడా బాగున్నట్టు తోచింది. ఈ కావ్యంలో నూటికి 90 పాళ్ళు ఆంధ్ర మాత్రమే కనిపించినా, ఆంధ్రను ఏదో ఒక సంఖ్యపెట్టి గుణిస్తే భారతం కాక తప్పదు విషాద భారతంలో ఒక్కమాటగూడా నాకు ఆక్షేపణీయంగా కనపడలేదు" అని కావ్యం విలువనిగూర్చి చెప్పారు.

సుప్రసిద్ధ సోవియట్ రచయిత దోస్తోవస్కీ తన నవలల్లో మీవంటి "గౌరవనీయులు" బూతు కూతలని పరిగణించేవాటిని సందర్భ మొచ్చినప్పుడల్లా నిర్భీతిగా వాడాడు. కావాలంటే ఆయన నవలల్ని ఇంతవరకూ చదవకపోతే ఇప్పుడైనా చదవండి! అంతెందుకు? నవయుగ కవితానాందీ ప్రస్తావకుడైన శ్రీశ్రీ "కాంపెల్ల జనార్ధనరావుకోసం" అనే ఉత్తమ వచన కవితాఖండికలో "దొంగలంజకొడుకు లసలే మెసలే ఈ ధూర్తలోకంలో నిలబడజాలక తలవంచుకొనే వెళిపోయావా నేస్తం!" అని అన్నప్పుడు, మహాకవి బూతు కూతల కవితని రాశాడని ఏ "మడి" గట్టుకున్నవాడైనా అనగలడా?! ఈ మధ్యనే వెలువడిన "దిగంబర కవులు" కవితా సంకలనంలో "దిగంబర" కావ్య ఖండికలో శ్రీ భైరవయ్య "తమలో-ప్రపంచంలో కొత్తదనం చైతన్యం కోరని, హర్షించని, సహించని కొజ్జాలకి" అని అంటాడు. ఆయనే "హూరే హూరే" అనే కావ్య ఖండికలో "ఊరిపెద్ద చిట్టిబాబు, ఛటా చోరు బడా బాబు, బాడుఖావు బుచ్చిబాబు" అని అంటాడు. లంజాకొడుకులు, కొజ్జాలు, బాడుఖావులు యీ సమాజంలో వున్నారు గనుక వారిని ఆ పదాలతో పిలవడం జరుగుతోంది. అయితే, ఈ శబ్దాలు మీలాంటి "గౌరవనీయుల" ప్రకారం బూతు పదాలే గావచ్చు!! అయితే, ఆ

పదాల్ని రచయితలు ఏ మనుష్యుల్నిగూర్చి, ఏ సన్నివేశాల్లో వాడారనేదే ప్రధాన సమస్య. అంతే ని కన్యా మానభంగాలూ, రండా గర్భాలూ గూర్చి పేజీలకు పేజీలు నింపి. నీచాతినీచమైన లైంగికోద్రేకాల్ని రెచ్చగొట్టి ఆడదాని రహస్యాంగాల్నిగూర్చి రాసి అణాపైసలు మూటగట్టుకొనే అసందర్భ అభిసారికా వర్ణనలు మాత్రం కావని మీరు గుర్తించాలి. (చూడు- 1964 డిసెంబరు అభిసారిక పత్రిక.) అయితే, సందర్భశుద్ధి వున్నా లేకున్నా, విషాద భారతంలో యిలాంటి వర్ణనలు కలికానికైనా దొరకవు. అలాంటప్పుడు మీరు ఏ కారణంచేత విషాద భారతంపై ఆగ్రహిస్తున్నారో అర్థంగాకుండా వుంది.

## లింగభేదం సూత్రీకరణ

"శాస్త్రీయంగా పరిశీలిస్తే ఒక స్త్రీ మనస్తత్వానికీ, ఒక పురుషుని మనస్తత్వానికీ వస్తుతహా ఎంతో విభేదం వుంటుంది" అని మీరు అన్నారు మీరు చేస్తూన్న ఈ సూత్రీకరణకి నేను నిర్ఘాంతపోతున్నాను. లింగభేదమనేది వ్యాకరణం లోనేకాని సాహిత్యంలో వుండనేరదనేది నిగ్గుదేలిన సత్యం. కాని తరతరాలుగా సమాజాన్ని శాసించిన పురుషాహంకారం యింకా నేటికీ ఈ నగ్న సత్యాన్ని అంగీకరించడంలేదు. పాత్ర చిత్రణంలో సంభాషణలు నడపడంలో, స్త్రీ పురుష లింగ భేదానికి కించిత్తూ తావులేదు. స్త్రీ పురుష మనస్తత్వాల రీత్యా శాస్త్రీయంగా మౌలికమైన విభేదం వుందని మీరు సెలవిచ్చారు. కాని. ఆ శాస్త్రంపేరు మాత్రం చెప్పారుకారు. మనుధర్మశాస్త్రం ప్రకారమా లేక కౌటిలీయార్థశాస్త్రం ప్రకారమా ? పరాశర, నారద స్మృతుల ప్రకారమా ? నరరూప రాక్షసుడైన ఆపస్తంబుడు చేసిన సూత్రీకరణ ప్రకారమా ? కాక వాత్స్యాయన కామ సూత్రాల్ని అచ్చమైన తెలుగులో ప్రతి నెలా అచ్చుగొట్టి, ధారావాహికంగా ప్రకటిస్తూ, ధారాళంగా డబ్బు మూటలు గట్టుకొనే అభిసారిక పత్రిక ప్రచారం జేస్తోన్న "అచ్చ స్వచ్ఛమైన" శాస్త్రజ్ఞానం ప్రకారమా ? ఏ శాస్త్ర సిద్ధాంత ప్రాతిపదికపై మీరీ నిర్ణయం చేస్తున్నారు ? ఈ మనస్తత్వ విభేదమనేది తరతరాల వర్గ సంఘం, తన నితాంత నిరంకుశాధికారంతో స్త్రీని ఒక భోగ వస్తువుగా మార్చి కృత్రిమంగా కల్పించిన విభేదం గాదా ? ! స్థలాభావంచేత యిందుకు సంబంధించిన వివరాల్లోకి ప్రస్తుతం వెళ్ళడానికి అవకాశం లేదు.

డాంగే "భారతదేశం"లో "మాతృస్వామిక సమాజ పతనమూ - స్త్రీ బానిసత్వం" అనే విషయాన్నిగూర్చి చర్చించిన 10 వ అధ్యాయాన్నీ, పాల్ లెఫార్గ్ రాసిన "ఆస్తి-దాని పరిణామం". ఎంగెల్స్ రాసిన "కుటుంబం-ప్రైవేట్ ఆస్తి-రాజ్యాంగం" అనే ప్రపంచ ప్రసిద్ధి గ్రంథాన్నీ చదవండి. సుప్రసిద్ధ మార్క్సిస్టు సాహితీవేత్త రాహుల్ సాంకృత్యాయన్ రాసిన "ఓల్గాసే గంగా" రచనగూడా చదవండి.

# II

విషాదభారత కావ్యకర్తశైలి "అపురూపమూ అతి నిర్భయ హృదయావిష్కరణమూ, అననుకరణమూ, అనితర సులభమూ" అంటూ అకారంమీద దంచేసిన మీరు పేరా తిరక్కాపూర్వమే "గుండెనిండా కక్ష పొంగే రాజకీయ పాక్షికోపన్యాసకుల శుష్కశైలి పుష్కలంగా" ఆ కావ్యకర్తకి పట్టుబడిందన్నారు. కావ్యకర్తసైతం తన శైలి అపురూపమూ, అనితర సులభమని బహుశా అనుకోరేమో?! అయితే, ఈ చచ్చుడప్పుల చప్పుడుద్వారా మీరు ఎవరి కళ్ళల్లో దుమ్ముకొట్టదలచుకున్నట్లు? ఇది సాహితీ విమర్శా? లేక చేతికొచ్చిన చెత్తనంతా తెల్లకాయితంపై రాసి ఖరాబు చేయడమా? గొడ్రాలిబిడ్డ, కుందేటి కొమ్ము ఫాసిజంలో మానవతవంటి పరస్పర విరుద్ధ సూత్రీకరణలు చేసి, మార్క్స్ ప్రతిపాదించిన విరుద్ధ శక్తుల సంఘర్షణా సిద్ధాంతానికి మేలిబంగరు తొడవులు తొడగాలనే పేరాశతోనా మీరీ సర్టిఫికెట్టు విషాదభారత కావ్యకర్త శైలికి యిస్తున్నారు?!!

విషాదభారతం కవితలో "ఆలోచనామృత నిష్యందత" లేదనీ, పాదాలు విరిచి పోగులు పెట్టిన శుద్ధ సావేశ వచనంలాగా ఒకమారు చదివితే చాలనిపించే, విసిపించే మొనాటనస్ టోన్ ఉండటం మన కవిత్వానికి సైతం గర్వకారణం" కాదనీ, "గుండెనిండా కక్ష పొంగే రాజకీయ పాక్షికోపన్యాసకుల శుష్కశైలి" కావ్యకర్తకి పట్టుబడిందనీ, "తాత్కాలికమైన ఉద్రేకమూ తాటాకు మంటవంటి ఆవేశమూ కలిగించడమే కవిత్వం సాధించాల్సిన పరమ ప్రయోజనం" గాదనీ, "మిత్రుడు శ్రీ రమణారెడ్డి వ్రాసిన కావ్యోపోద్ఘాతం నిర్మోహమాటంగా ప్రకటించిన తీవ్ర భావాలతో" సాగిందనీ మీరన్నారు.

సుప్రసిద్ధ అభ్యుదయ కవీ, సాహితీ విమర్శలో దుర్నిరీక్ష్యులైన శ్రీ కె. వి. రమణారెడ్డి కావ్యానికి పీఠిక రాస్తూ "పూవుల్లేవు, తావుల్లేవు, సంజల్లేవు, సంగీతాల్లేవు, నగిషీల్లేవు, నాణ్యాల్లేవు, భాషా టోపాల్లేవు, అలంకారాల కుచ్చుల టోపీల్లేవు, అయినా కవిత్వం వుంది" అని తమ అభిప్రాయాన్ని కుండబద్దలు గొట్టి చెప్పారు. ఈ మాటలన్న శ్రీ రమణారెడ్డికి మీ వాదనప్రకారం కవిత్వమంటే అణుమాత్రమైనా తెలియకుండా పోవాలి. లేదా కవిత్వానికి మీరిచ్చే నిర్వచనం కపిత్వమైనా అయి వుండాలి. ఈ రెంటిలో ఏది సత్యమో, ఏదసత్యమో, మిణుగురు పురుగుల కవిత్వంద్వారా మీరు దర్శించిన ఆ పరమాత్మకే తెలియాలి. (చూడు- "మిణుగురులు" కావ్యం- శ్రీ సోమసుందర్) అంతేకాదు: "ఇది

కవిత్వం కాదు. కపిత్వం అని నిర్వర్ణించే విమర్శకులు ఇంకా ఉన్నారు. ఎప్పుడూ ఉంటారు" అని శ్రీ రమణారెడ్డి కావ్యపీఠికలో సాహితీజోస్యం చెప్పినప్పుడు ఆయన ఎంతటి దూరదృష్టి ప్రదర్శించారో మీ జాబు చదివిన తర్వాత నా కిప్పుడు పూర్తిగా అవగతమవుతోంది.

## కతపొంగే శుష్క శైలా యిది ?

పెట్టుబడికి, కట్టుకథకితాకట్టుపడిపోయినగుత్తపత్రికలూ, వాటి సాహితీమిత్రులూ కావ్యంలో కవిత్వం లేదనీ, "గుండెనిండా కతపొంగే రాజకీయ పాతికోపన్యాసకుల శుష్కశైలి" కావ్యకర్తకి అలవడ్డదనీ అంటే బాధపడనుగాని మాజీ అభ్యుదయ కవియైన మీరే ఈ మాట అంటే ఎలా అవగాహన చేసుకోవాలో తెలీని ఆలోచనామృత నిష్యందరాహిత్యంలో మొలబంటిలోతుదాకా కూరుకుపోయి, ఊపిరి సలపక ఉక్కిరిబిక్కిరై చస్తున్నాను. 1948లో నైజాంనవాబుకీ, జమీందారీ జాగీర్దారీ భూస్వాములకీ వ్యతిరేకంగా తెలంగాణా ప్రజలు భూమికై, భుక్తికై జరిపిన వీరోచిత పోరాటాన్ని "వజ్రాయుధం" కావ్యంగా మీరు రాసినప్పుడు:

"తీయండి తీయండి రాక్షసుల ప్రాణాలు హైదరాబాదు ఖిల్లాలోని తొర్రలో పుర్రెలో దాచుకున్నాడంట, రాక్షసుడు ప్రాణాలు దేశముఖు కుక్కలను కాపలా ఉంచాడు."

*                *                *                *

"వీర రక్కసుని పాతిపెట్టండి! పూడ్చండి!!" అని అన్నారు. ఈ పై భాగం గుండెనిండా కత పొంగే శుష్కశైలితోనే రాశారనీ, కుక్కలూ, పాతిపెట్టడం వంటి పదాలు వాడరాదనీ నేనంటే సమంజసంగా వుంటుందా ?!

1-9-65 తేదీనాటి విశాలాంధ్రలో మీరు ఈ "కతపొంగే శుష్కశైలితోనే" "రుద్ర నేత్రం" తెరిచారా ?!

విషాద భారత కావ్యకర్తకి గజ్జల మల్లారెడ్డికి కసి, కక్ష వుందని సెలవిచ్చారు. ఎవరిమీద ? ఎందుకోసం ?? మేడలూ, మాడలూ లేవనా ? మామిడి తోటల్లో అరటిచెట్ల చాటున, దాసీ స్వాముల అనుబంధాన్నిగూర్చి, ఆత్మ పరమాత్మల అలౌకిక ఐక్యసంధానం గూర్చి, "జీవన్ భద్రాణి పశ్యతి" గూర్చి కోయిల్లా తియ్యగా పాడుకొంటూ మీ మిణుగురు పురుగుల కవితలాంటివాన్ని రాసుకొనేందుకు తీరిక లేదనా ?! కాక, కాసులు లేవనే కసితోనా ? కవిత్వానికి అందునా- అభ్యుదయ కవిత్వానికి అణుమాత్రమైనా ప్రోత్సాహం లేని ఈ దుర్దినాల్లో విషాద భారత ప్రచురణకి సాహసించి ఉపక్రమించడం చేతి చమురు భాగోతం తప్ప వేరుకాదని మీకు తెలుసు కీర్తికోసమా ? తిట్లూ, శాపనార్థాలూ, మరీ పరిస్థితి విషమిస్తే జైళ్ళేగా ప్రాప్తించేది ?!

19

# కసి కాదు! నిప్పులాంటి నిజాయితీ!!

"కసి" అభ్యుదయ కవుల్ని కావ్యాలు రాయమని పురికొల్పుతుందా?! కసి వింపుకొని ఇతరులమీద విషం కక్కడం అభ్యుదయ కవులపనా? అందుకేనా! వాళ్ళు రాత్రింబగళ్ళూ శ్రమించి రక్తాన్నీ, కన్నీటినీ ధారవోసి తిట్లకూ, శాపాలకూ ఎదురు నిల్చి కావ్యాలు రాసింది; నేటికీ రాస్తోంది? శ్రీ మల్లారెడ్డినీ, విషాద భారత కావ్యకర్తనీ కలగలిపి అన్న ఈ మాటనిబట్టి రచయితగా మీ నిజాయితీనే శంకించవలసిన అవసరాన్ని మీరే కల్పిస్తున్నారు. కసితో అభ్యుదయ కవులు కవిత్వం రాయలేరు. సొంత ఆస్తులూ, పదవులూ, వారసత్వాలూ పోయాయని ఇతరులమీద వారు కసి చెందడంలేదు. స్వార్థంతోకూడిన వ్యక్తిగత పోరాటం కసిలోనుండి ఉద్భవిస్తుంది. అభ్యుదయ కవులు స్వార్థంకోసం రాయడంలేదు. అంచేత అభ్యుదయ కవుల్లో వుండేది "కసి" కాదు, నిప్పులాంటి నిజాయితీ. నిజాయితీతో వారు కవిత రాస్తే కసితో శ్రీ ముదిగొండ శివప్రసాద్ మహాసర్గ రాశాడు. ఇదే ముదిగొండకీ, విషాదభారత కావ్యకర్తకీ వున్న మౌలికమైన భేదం. ఈమాత్రం తేడానుగూడా గుర్తించలేని మీరు సాహితీ విమర్శకి తగుదువమ్మా అంటూ దిగడం శుద్ధ వెర్రితనం

ఆత్మద్రోహానికి ఆహుతైపోయిన అభ్యుదయ సాహితీ పతాకను తిరిగి ఆధునికాంధ్ర సాహితీ గగనవీధుల్లో ఎగురవేసే సత్సంకల్పంతోనూ, వర్తమాన భారత ప్రజాతంత్రంలోని చీకటి వెలుగులపై టార్చిలైటు వేసి. ఆ కఠోర సత్యాలను చేతనైనంత మేరకు సామాన్య పాఠకులముందు పెట్టే ఉద్దేశంతోనూ విషాద భారత కావ్యావతరణం జరిగింది.

మీ జాబు చదివింతర్వాత "అభ్యుదయ" కవులుగా నేడు చలామణీ అవుతోన్న కొందరిలో కుహనా కవితాధోరణి ప్రవేశించి వారి నెంతగా అధః పాతాళానికి కొనిపోతున్నదో గమనించి నిర్ఘాంత పోతున్నాను. అవకాశాలకోసం సొంత చేతుల్తో ఏర్పాటు చేయించుకొన్న సన్మానాలకోసం, అందులో చెక్కభజన ప్రశంసలకోసం కీర్తికోసం ఆశించే ఈ తరహా "అభ్యుదయ" కవుల్లో దృష్టిదోషం ప్రవేశించి "క్రానిక్" అయిపోయింది. సామాన్య మానవుల హక్కుల కోసం ప్రాణాల్ని తృణప్రాయంగా పరిగణించి, పోరాడ నిశ్చయించిన దేశభక్తులు క్రూర నిర్బంధ విధానానికి గురిచేయబడుతోంటే దేశంలో క్రమంగా ప్రజాతంత్ర జ్యోతి కొడిగట్టిపోతోంటే చీమ కుట్టినట్లుగా గూడా భావించక షేర్‌వాణీలూ, కంజరీటోపీలు పెట్టుక తిరుగుతూ సున్నిత పదజాలంతో "సుతిమెత్తని భావాల్తో" సంజెల్ని, చక్కని చుక్కల్నీ ఏిరెండిన చెరువుల్నీ, అందులోని కొంగల్నీ, అవి తినే ఎండ్రకాయల్నీ వర్ణిస్తూనో లేదా అరతులం ఆకల్నీ, అర

లీటరు ఆవేశాన్నీ జాగ్రత్తగా మిగాయించి, ఎవరికీ కోపం రాకుండా కవిత్వం రాసే కొందరు "అభ్యుదయ" కళ్ళదాలలోని అద్దాల్ని పోగొట్టుకొని ఉత్త ఫ్రేంని మాత్రమే మిగుల్చుకున్నారు. సుఖాపేక్షలో పడి తమ కళ్ళద్దాలలో అద్దాలు లేవన్న సంగతి తిరిగి చూసుకొనేందుకు తీరికసైతం చిక్కక, మాదే అభ్యుదయ దృక్పథ మనుకుంటున్నారు. ఇలాంటివారికన్నా మీ రేమాత్రం భిన్నమైన వ్యక్తి కాదు. కాకపోతే మీ రీమధ్యనే ఆంధ్రప్రభ వారపత్రికలో రాసిన ఈ క్రింది గేయాని కున్న విలువ, సాహితీ సామాజిక ప్రయోజనం కుండపెంకు కున్నంతైనా వుందా అని నేను మిమ్మల్ని బహిరంగంగా ప్రశ్నిస్తున్నాను.

"ఎన్ని కలలు కనెనోకదా ప్రియకాంత ?
ఎన్ని పూలు రాల్చినదో పున్నాగ ?
పీ రెండిన చెరువులలో
బారులు తీరిన కొంగలు
జొన్న వెన్ను కళ్ళములో
కన్నుచెదురు పావురాలు"

ఇదా అభ్యుదయ కవిత్వం ? ! ఇందులో ఆలోచనామృత, నిష్యందత, వ్యంగ్య కవితావైభవం ఎంత వుంది స్వామీ ? !

## నేడు నిజాయితీగల కవి కర్తవ్యం

మున్నెన్నడూ లేనంతగా ఈనాడు అభివృద్ధి నిరోధక శక్తులు ఉవ్వెత్తున లేచి, వేయి పడగలు విప్పి సామాజిక వివిధ రంగాలను కాటేసి విషపూరితం గావిస్తుంటే, అందరూ అనుభవించవలసిన స్వాతంత్ర్యం కొందరి ఉంపుడుకత్తెగా మారగా, నిజాయితీగల ఏ కవి అయినా చెవి కిర్రుమనేట్లు అరుస్తాడు; తిరగబడ తాడు; నిలదీస్తాడు. విషాదభారత కావ్యకర్త నిస్సందేహంగా ఈ పనినే చేశారు. ఇందులో మనవ సౌందర్యం లేదనడం హాస్యాస్పదం. కోటానుకోట్ల మూగజీవుల ఆవేదననూ, అసంతృప్తినీ ప్రతిబింబింపజేసి, వారి భావాలకూ, నేటి కఠోర పరిస్థితులకూ ప్రతిభావంతమైన సాహితీ స్వరూపాన్ని ఇచ్చింది విషాదభారతం. ఇందులో కవిత్వం లేదనడం శుష్కవాదనా ప్రియత్వం మాత్రమే.

"పతిత్వ భావనా పతిమ మరింత ఉన్నతలోకాలవైపు తెరవలేని ఏ కవిత్వమూ ఉత్తమ కవితగా నే నెంచలేను" అని మీ రన్నారు. పతితల్ని ఉన్నత లోకాలకూ, ఊర్ధ్వ లోకాలకూ తీసుకుపోవడం అభ్యుదయ కవుల పని గాదు. ఉంటున్న లోకంలోనే వుంచి, ఉన్న మంచిచెడ్డలను పామరజనులకి సైతం అర్థమయ్యే భాషలో తెలియజెప్పి, కర్తవ్య ప్రబోధం గావించడం అభ్యుదయ రచ

యితల పని. ఈ పని మధ్యయుగాల్లో వేమన, అనంతరం గురజాడ, ఆ పిదప శ్రీ శ్రీ, మరికొంతమంది ప్రథమతరం అభ్యుదయ కవులూ చేశారు. సరిగ్గా ఇదే పనిని వర్ధమాన అభ్యుదయ కవుల్లో విషాదభారత కావ్యకర్తగూడా చేశారు.

కవిత్వం సాధించవలసిన పరమ ప్రయోజనాన్నిగూర్చి మీరు రాస్తూ, "పఠితృ హృదయంలో మనన సౌందర్యం తెరలించాలనీ", "ఆలోచనామృతం రసప్లావితం కావాలనీ, అప్పుడే కవిత చిరంతన ముద్ర వేయగలుగుతుంద"నీ, అట్టి ప్రయోజనాన్ని విషాదభారతం కలిగించడంలేదనీ మీరన్నారు.

"ఏవిటండీ యిది లోకమా ?
కాక విషం కలిసిన రుచి పాకమా ?"
"వర్గాలతోయున్న నేటి సంఘం
మానవజీవిత ప్రతిష్టకే శృంగభంగం"
"సృష్టి స్సమిష్టితో కలిస్తే శక్తి
చీలిపోతేలేదు నరునికి విముక్తి"
(విషాద భారతం - భరత వాక్యం)

ఈ వాక్యాలు ఎంత ఉన్నత తాత్విక ప్రాతిపదిక కలవో వేరే చెప్పనవసరంలేదు. అలాగే—

"ఆధునిక ప్రజాస్వామ్యమంటే పొద్దుతిరుగుడుపువ్వు
ఆధునిక ప్రజాస్వామ్యమంటే సానిదాని నవ్వు
ఆధునిక ప్రజాస్వామ్యం ఒక ప్రాస్టిట్యూటు ఓటు దాని గేటుకి చెల్లించేరేటు."
"నేటి ప్రజాస్వామ్యంలో ఓటుగాదు- సీటుగాదు డబ్బుమూట ప్రధానం
అదే అంతిమ గమ్యం! అందరికీ పరమాదర్శం!!!"
"పెట్రోలుగొట్టించి చేతికి రెండు పచ్చనోట్లిస్తే
పోస్టింగ్‌గానీ ఊస్టింగ్‌గానీ
అయిదు నిమిషాల్లో హైదరాబాదులో అటో ఇటో దేల్చేస్తాడు."
"రామరాజ్యమా - కామరాజ్యమా ?"
"డార్విన్ జీవపరిణామ సిద్ధాంతంపై థీసిస్ రాసి
డాక్టరేట్ గడించిన సైన్సు యమ్మెస్సీ
ఊర్లో కలరావస్తే ఇంట్లో పోలేరమ్మకి
సద్దినైవేద్యంబెట్టమని సతాయిస్తున్నట్లుగా"
"పెళ్ళానికి టైఫాయిడ్వస్తే
ఏసుప్రభువును ప్రార్థించే పీటరు ప్రభాకరంలా"
"నేటి సొసైటీ విశాఖపట్నం ల్యూనటిక్ ఎసైలంలా తయారైంది"

"దేశాన్ని అమావాస్య ఆవహించింది
అధికారం అవినీతికి దోవతీసింది
హద్దూపద్దూలేని నిరంకుశాధికారం
అంతూపంతూలేని అవినీతికి మార్గం వేసింది"

నిసర్గసుందరమైన కవితకి ఆలవాలమైన ఈ భాగాలు ఎంతటి నవన సౌందర్యం కలవో ఆలోచించండి.

## కవిత్వానికి ఉండాల్సిన లక్షణాలు

కవిత్వంలో ఏ ఏ లక్షణాలుండాలని మీరు సలహా ఇస్తోన్నారో, ఆ లక్షణాలు వజ్రాయుధం కావ్యం మినహా తదనంతరం మీరు రచించిన ఏ కావ్యంలోనైనా చూపగలరా? "సర్వలక్షణ సమన్వితంగా ఈ కావ్యం అమరలేదనడం అసమగ్ర నిర్ణయం కాదనుకుంటా"నని మరో స్టేట్‌మెంట్ విసిరిపారేశారు! అభ్యుదయకావ్యానికి ఏఏ లక్షణాలుంటే సర్వలక్షణ సమన్వితంగా అమరుతోందో చెప్పివుంటే అభ్యుదయ సాహిత్యం మిమ్మల్ని అపర జగన్నాథ పండితునిలా పూజించి పైకెత్తి ఉండేది. కనీసం ఆ పనిగూడా పాపం మీరు చేయలేదు!

"వర్తమాన కాలీన స్థితిగతుల రిపోర్టు కవిత్వం అవుతుందా?!" అని ఒక ప్రశ్నవేశారు. "దేశ కాల పరిస్థితులను ప్రతిబింబించలేని ఏ కావ్యమూ సమగ్రతర సజీవత వున్నది కాదు. అట్టిది పలాయన వ్యాధి పీడితం" అని పరస్పర విరుద్ధమైన మరో "మహోజ్వల" సిద్ధాంతాన్ని ప్రవచించి, మీ దవడని మీరే వాయించుకున్నారు. మొదటి సూత్రీకరణకీ, రెండవ సూత్రీకరణకీ ఏమైనా కించిత్తు పొత్తు వుందా?! గజం మిథ్యా పలాయనం మిథ్యా తర్కంలా వుంది! దేశ కాల పరిస్థితులను ప్రతిబింబించలేని కావ్యం, పలాయనవ్యాధి పీడితం అని అన్న మీరు అభ్యుదయ కవిగా అవతరించకపూర్వం- 1845 ప్రాంతాల రచించిన "మిణుగురులు" వచన కవితా సంకలనాన్ని 1963 లో ఎందుకు ప్రచురించినట్లు?! ఈ కావ్యం ఏ దేశ కాల పరిస్థితులను ప్రతిబింబించుతోంది? అది పలాయన వ్యాధి పీడితంగాదా? మీరే సెలవివ్వాలి మరి!!

ప్రకృతి వైపరీత్యాలని గూర్చిన శాస్త్రజ్ఞాన రహస్యాలు తెలియని వైదికార్యుడు ఆదికాలంలో విలువెత్తున పొంగి, నిసర్గసుందరమైన కవిత ఋగ్వేదంలో చెప్పాడు. తను ఊహించిన భగవంతుని చిద్విలాసాలకి, నిలువెత్తున పొంగిన టాగూర్ గీతాంజలి రచించాడు. చంద్రమండలానికి మానవుడు నేడో రేపో ప్రయాణం గట్టుతోండగా, సూర్యచంద్రాదులూ, పండు వెన్నెలా, గండు కోయిలా, మాధవ స్వాములూ, మామిడితోపులూ, సుందరి అనడాలూ, మీరు

"స్వామి"ని కనడాలూ గూర్చి కవిత చెప్పిల, అది మునిల్దాని విరహంలా కృత్రిమంగా వుండదా ?! (చూడు- మిణుగురులు కావ్యం). అలాంటపుడు మీరు మీ మిణుగురు పురుగుల కవితలో "మననసౌందర్యం తెరలించడం, ఆలోచనామృతం రసప్లావితం గావించడం, చిరంతన- ముద్రవేయడం"వంటి "నిసలైన" కవితా ప్రయోజనాలను ఏ మేరకు సాధించగలిగారో సెలవివ్వగలరా ?! లేక చచ్చిన కాలంలో రాసి, బతికున్న కాలంలో ప్రచురించామనేదే మీ సమాధానమైతే, అంతకన్న ఆత్మవంచన మరొకటి వుండదు!

అంతేకాదు; "నవత" త్రైమాస పత్రిక ద్వితీయ సంచికలో మీరు రాసిన ఈ క్రింది వచన కవితా ఖండికకున్న సామాజిక కవితా ప్రయోజన మెంత ?!

"నన్ను కాపాడు పాడు హాయి గొలిపే
షడ్యమస్వర కంఠాన్ని పలికించి,
ప్రణయామృత స్రోతస్వినుల వెలయించి
హృద్యంగా దేవ గాంధారి నాలపించి
వాడని పూరేకులవంటి పల్లవ పాణులతో
నా తల నిమురుతూ సేద తీర్చుతూ
నా వెన్నుబాము మెట్లపై నీ అంగుళుల నడిస్తూ
క్రొంబులకల గగుర్పాటుల మొలిపిస్తూ
దడుసుకున్న పేదగుండె ప్రియసఖీ సేదతీర్చు
వలపు పులకల మాదకానుభూతి కలిగించు"
"రా, ఇదే ఖరారు, ఎడద ఎడారిలో వలపుల బిడారు
రా, ఇదే రాత్రి వచ్చి చూలింత ధాత్రి ముమ్మోనసిన పిసాళి
రా, జాగేల, పరాకేల, రాకేందు వదనా, కుంద రదనా,
రా, మామక మానస సాగిరాన బిరాన నీకై తేలింది విరాళి"

## పరమ దుర్మార్గ నియంతృత్వం కొనసాగుతూ వుండగా....

అన్నపూర్ణవంటి ఈ దేశంలో అన్నమో రామచంద్రా అని కోటానుకోట్ల ప్రజలు అలమటిస్తూ, ఆకులూ, అలమూమేస్తూ, ఆకలిచావులకు గురిఅవుతూంటే, ప్రజాతంత్రం పేరిట దజావూ, నేరమూ, విచారణాలేకుండా పరమదుర్మార్గ నియంతృత్వం కొనసాగుతోంటే, స్వాతంత్ర్యం పేరిట పరమ వంచకత్వం పద్దెనిమిదేళ్ళ నించీ కొనసాగుతూ మనుషుల్ని పశువులకన్న కనాకష్టంగా మారుస్తోంటే, వీధిమానిసిబతుకు దినగండం నూరేళ్ళ ఆయుష్షుగా దిగజారిపోతోంటే- మీ తలని నిమురుతూ, "సేద" తీర్చుతూ (తాపమా స్వామీ!!!) మీలో కొత్త పులకల గగుర్పాటుల మొలిపిస్తూ, వలపు పులకల మాదకానుభూతిని కలిగించేందుకు

రాత్రి సమయంలో ప్రేయసీ రావే- అని ఆహ్వానించే కవిత్వాన్ని రాస్తున్నారా ? ! !
రాకేందు వదనల్నీ, కుందరదనల్నీ మానస సాగరాన విరావ తేలిన విరాళిలో పండువెన్నెల్లో అభిసరించేందుకు (వ్యభిచరించేందుకు గాదుసుమా ! !) రమ్మనమని కోరుతూ గీతం రాయడం సిగ్గుచేటుగదా ? ఇది మెరకవీధి కవిత్వమా ? ఈ లాడ్జింగ్ అభిసారికా కవిత్వంలో గర్భీకృతమైవున్న సామాజిక, కవితా ప్రయోజనాలపాళ్ళెంతో సెలవిస్తారా ? ! ఇలాంటి జుగుప్సాకర "విరహ" గీతం రాసే హక్కు రచయితగా మీకున్నా, ప్రత్యేకంగా వర్తమాన భారతదేశ పరిస్థితుల దృష్ట్యా, అది క్షంతవ్యంగాని ఘోరనేరంగా మీరు పరిగణించారా ? లేక, విజయనగర చక్రవర్తి కృష్ణరాయలు కలలోకొచ్చి, అలనాడు, అల్లసానివానికిచ్చిన నిరుపహతి స్థలమూ, రమణీప్రియ దూతికా, కప్పురవిడెమూ, ఆత్మకింపయిన భోజనం, ఉయ్యాలమంచం గట్రా ఇస్తానని ఏమైనా వాగ్దానంలాంటిది చేయగా, తెచ్చుకున్న కృత్రిమ కవితావేశంలో మీ రీ "విరహగీతం" రాశారా ? ఈ గీతం పఠితృ హృదయంలో ఎన్ని టన్నుల మనన సౌందర్యాన్ని భిలాయ్ ఉక్కుఫ్యాక్టరీలా ఉత్పత్తిచేసింది ? ఎన్ని గ్రాముల ఆలోచనామృత నిష్యందతని సృష్టించింది ? మరెన్ని తులాల రసపిపాసతో పఠిత హృదయాన్ని నింపింది ? ! రోమ్ తగలడుతోంటే ఫిడేల్ వాయించే నీరోలా, నిర్భర దారిద్ర్యంతో జనం రౌరవాది నరకతుల్యమైన బతుకులు గానుగెద్దుల్లా ఈడుస్తోంటే, వలపుల విడార్లూ, క్రౌంచులకలూ, పల్లవపాణులూ, విరాళులూ, పిసాళులూ, విరహతాపాలూ, చలువ తెమ్మరులూ, కలువ పయ్యెరలూ గూర్చి తలపోయటం, వాటిని తమ ప్రణయాభ్యుదయ కవిత్వంలో రాయడం సిగ్గుచేటు కాదా ? బాధపడకండి- ఏ పీరియడ్‌లో ఏ కవిత రావాలో, ఆ పీరియడ్‌లో ఆ కవిత వొచ్చి తీరుతుందనేది దేశదేశాల సాహితీ చరిత్ర చెపుతోంది. వర్ధమాన అభ్యుదయ కవులేగాక, ఆ సాహితీరీతిని అంగీకరించని "దిగంబర కవులు" సైతం, ఆఖరికి సాహిత్యంలో "అలీనత్వం" పాటిస్తోన్నామని భ్రమించేవారు సైతం, వర్తమాన సామాజిక కల్మషాలను మింగలేక యధోచితంగా ఎవరి ఆవేదనలని వారు రచనలద్వారా వెలువరిస్తూనే వున్నారు. నేటి తెలుగు కవి తన త్రినేత్రం తిరిగి తెరిచాడు. అందుకు అందరం సంతోషించాలి.

## తిరిగి అభ్యుదయ కవితాగానం

తాత్కాలికంగా మూగవోయిన అభ్యుదయ కవితామణి తిరిగి తన గొంతును సవరించుకొని వర్తమాన సామాజిక పరిస్థితుల కనుగుణ్యంగా ప్రతిభావంతంగా అభ్యుదయ కవితాగానాన్ని ఆలపించ ప్రారంభించింది. వాస్తవ పరిస్థితి యిలా వుండగా "నవత" ప్రథమ సంచికలో మీరు వ్రాసిన "వధూ మధూలిక" మీ అభిసారికా బ్రాండ్ కవిత్వానికి మరో మచ్చుతునక.

"కురుక్షేత్రంలో అర్జునునికి కలిగినట్లు నవ వధూవరుల కెవరికైనా తమ తక్షణ కర్తవ్యం గురించి ధర్మ సందేహ లేమైనా కలిగితే, ఈ గేయం భగవద్గీతా సదృశంగా అధ్యయనంచేసి సందేహ నివృత్తి చేసుకోవచ్చు."

"కాబట్టి హాయిగా నిరభ్యంతరంగా అంతరంగాల
చెలరేగే ఈప్సితాల నేడే విడుదల చేయండి
నిస్సంకోచంగా అనుభవించండి
మీ చేతినిండా ఉంది సుఖం!"

"ఇదీ ఈ గీతా పరమార్థం! ఈనాటి యువతీ, యువకులకు తృతీయ పురుషార్థ ప్రబోధం బుష్యశృంగునికి అవసరమైనట్లు అవసరమని కవిగారు భావించివుంటే, అది మరీ అంత నేరం కాదులెమ్మని సవరించుకొందాం. కానీ, వధూవరుల అవినాభావ సంబంధాన్ని వర్ణిస్తూ, నీ హృదయారామానికి ఆమె కోకిల– నీ హృదయాకాశానికి ఆమె శశిరేఖ– నీవు పుష్పం ఆమె సురభి వీచిక నీవు చంద్రబింబం ఆమె వెన్నెలరేఖ– నీవు గానం ఆమె శృతి అంటూ 25 సంవత్సరాలనుండి సినిమా ప్రేమికుల నోళ్ళలో నలిగినలిగి అరిగిపోయిన ఉపమానాలను మళ్ళీ ఈనాడు కవిత్వంగా, నవతాచిహ్నాలుగా భరించడం కష్టమేనే! మీ మహోజ్జ్వల ప్రణయాభ్యుదయ కవిత్వాన్ని గురించి ఈ మాటలంటున్నది నేనుగాదు స్వామీ! 18–6–61 విశాలాంధ్రలో "నవత" పత్రికలోని మీ రచనను గూర్చి సమీక్షిస్తూ, సుప్రసిద్ధ సాహిత్యవిమర్శకుడు శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి అన్న మాటలు! ఇల్లాంటి తుచ్ఛ కాముకోద్రేక కవితను మీరు రాస్తే, విషాదభారత కావ్యంలో అవి లేవు, ఇవి లేవు అని అవాకులూ చవాకులూ విసరడానికి మీకున్న అర్హత– స్తోమతా ఎంతని నేను మిమ్మల్ని నిలదీసి నిక్కచ్చిగా అడుగుతున్నాను. ఆగ్రహించకండి!

మీరు వ్రాసిన వజ్రాయుధానికి నా నమస్కారం. ఆ మహోదాత్త కావ్యానికి యావదాంధ్ర అభ్యుదయ ప్రజానీకం హృదయపూర్వకంగా నివాళులెత్తింది. అంతటి ఉదాత్త రచన తదనంతరం మీ కలంనుండి రాలేదు. ఇకముందు వస్తుందనే విశ్వాసమూ నాకు కాసింతగూడా లేదు! వజ్రాయుధం రచనతర్వాత మీలో భౌతికంగా నైతికంగా నేగాక, ఆధ్యాత్మికంగా, సైద్ధాంతికంగ గూడా చాలా మార్పులొచ్చాయి. ఆ వివరాల్లోకి, ఆ అభిసారికా మార్పు రహస్యాలజోలికి వెళ్ళే తీరికా–కోరికా నాకు ప్రస్తుతం లేవు. ఎందుచేతంటే, ఈ వ్యాసం సాహితీ విమర్శకే పరిమితం!

1–8–65నాటి విశాలాంధ్రలో "రుద్రనేత్రం తెరుస్తానీ రాత్రి" అన్న మీ రచనలో "జీవితానికి మారుపేరు ప్రేమ అనుకొని భ్రమించాను నేనిన్నాళ్ళూ" అని మీరు పొందిన వెర్రిమొర్రి భ్రమల్ని మీరే తిరగేసి మరగేసి తరిగేసుకున్నారు!

మీ "కలంన్నీ విలపించి మరణించి స్మశానాలలో కొరవి దయ్యాలుగా" అహోరోస్తున్నవని" వాపోయారు ! కనుకనే పాతికేళ్ళుగా రాసిన కవిత్వాన్ని "తలక్రిందులుగా చదువు" కోవాల్సిన దుర్గతి మీకు పట్టింది. మీ భావాల్లో, ఆలోచనా ధోరణిలో, సంభవించిన తీవ్ర తిరోగమనానికి, మీకై మీరే స్వయంగా రాసుకున్న పై వాక్యాలే ఎదురులేని నిదర్శనం. ఎడారుల్ని చూచి ఒయాసిస్సులనుకొని, జీవితానికి మారుపేరు ప్రేమ అని భ్రమిసి, గోత్రాలు బిడ్డల్ని కంటుందని మురిసి, ఇన్నేళ్ళుగా కన్న పగటి కలలన్నీ పచ్చికల్లలుగా పూచికపుల్లలుగా మారగా, నేడు మీరు "అఘోరించక" మరేం చేస్తారు ? ! పచ్చకామెర్ల ప్రణయవ్యాధితో ఇన్నేళ్ళుగా బాధపడి చివరికి నేటికైనా, "రుద్రనేత్రం" తెరిచి, తిరిగి వాస్తవ జగత్తులోకి వచ్చే ప్రయత్నం చేస్తున్నారని మీ రుద్రనేత్రం రచన ప్రచురింపబడిన తర్వాత మా బోంట్లం ఆశించాం. కాని వారం తిరగలేదు ! మా ఆశలు అడియాశలయ్యాయ్ ! "రుద్రనేత్రం" రచనలోని ఆ ఊపుపోయి, మళ్ళీ భావకవిత్వం వాపు వొచ్చింది ! (చూడు—"పునరుజ్వల"–8-8-65 విశాలాంధ్ర) మీరు యిన్నేళ్ళుగా పొందిన భ్రమలాంటివి విషాద భారత కావ్యకర్తకి ఏనాడూ లేవు ! ఇందుకు మనమంతా సంతోషించాల్సిందిపోయి, ఇలాంటి అసంబద్ధ వాచనలతో కూడిన జాబుల్ని రాయడం ప్రచురించడం మంచిదిగాదని వినయపూర్వకంగా విన్నవించుకుంటున్నాను.

## IV

అత్యంత ప్రమాదావస్థకి లోనై కొనవూపిరితో కొట్టుమిట్టాడుతున్న వర్తమాన భారత ప్రజాతంత్రం, విషాదభారత కావ్యేతివృత్తం. భారత ప్రజాతంత్ర వ్యవస్థను కాచి కాపాడి ధర్మ సంరక్షణార్థం ప్రతిపక్ష కులను చెండాడి, ప్రగతిశీల శక్తులను పరిరక్షించేందుకు ప్రళయరుద్రుడులాంటి నవుడు కవిత్వత్రినేత్రం తెరుస్తాడనేది బీజారోపణం. ఇది నాందిలో నిర్దిష్టంగా ప్రస్తావించబడింది. విశ్వరూప సందర్శనపర్వం కావ్యానికి పరాకాష్ట. మహాప్రస్థాన పర్వం ముగింపు.

విశ్వరూప సందర్శనపర్వం కావ్యకర్త మహోన్నత భావనాపటిమకు, మహాప్రస్థానపర్వం ప్రతిభకూ నిదర్శనం. దుర్గంధభూయిష్టమైన వర్తమాన సామాజిక వ్యవస్థ వున్నంతవరకూ విషాదభారతానికి జీవం వుంటుంది.

"ఈ కృతిలో కృతికర్తని అచ్చమైన కవిగా నిల్పే వాక్యాలు లేకపోలేదు. కాని అట్టివి తక్కువకావటంతో ఈ కృతి పల్చబడింది" అని మీరన్నారు. తగినన్ని అంటే ఎన్ని ? రెండుపుంజాలా లేక రెండువందల డజన్లా ? ! కంటికి ఏ దోషమూ లేకుండా వుండి ఆనందించగల హృదయముంటే కావలసినన్ని వున్నాయి. చూడ నిరాకరిస్తే చేయగలిగిందేమీ లేదు. ఎన్నికల ప్రచారపర్వంలో బాబాగారి వర్ణనా, ఓంచేసే పదారాల వివరణా, మహిళామండలి లీడరుగారి అవతరణా చిరస్మరణీయం గాదా ? ఈ భాగాల్లో ప్రతిభావంత మైన కవిత కనిపించలేదా ?

"ఓడజన్ చక్రకేళీలూ అరడజన్ నారికేళాల నీళ్ళూ
బాబాగారికి రాత్రింబవళ్ళూ పరిచర్యజేసే
కన్నెపిల్లల్లాంటి కాశ్మీర్ ఏపిల్ పళ్లూ
స్వర్ణపాత్రలో బాదంపాలూ అప్పుడప్పుడూ కోళ్ళూ."

సమకాలీన కళ్మలాన్ని ఎంతో ప్రతిభావంతంగా వివరించి, వర్ణించిన ఈ కావ్యంలో కవిత్వం లేకపోతే, మరి దేనిలో వున్నట్టు? వంటింటి పద్యాల్లోనా? మీ. జీవన్ భద్రాణి వశ్యతిలోనా? విశ్వరూప సందర్శన పర్వంలో అప్పలరాజు వర్ణన ఎంత ప్రతిభావంతంగా సాగిందో చూడండి:

"మహోద్దండ గండభేరుండ చండప్రచండవదనంతో
అగ్నిలాంటి నాలికను ఆడిస్తూ-

చింతనిప్పల్లా మండుతూన్న కళ్ళని మూస్తూ, తెరుస్తూ
మధ్యమధ్య పళ్ళు కొరుకుతూ పిడికిలి బిగిస్తూ
లక్షోప లక్షల రూపాలుగా విస్తరిల్లిన
అవినీతి బంధుప్రీతి ఆశ్రిత పక్షపాతం
లంచగొండితనం రండాగొండితనం నిరంకుశత్వం శిరస్సులతో
పన్నులు సమ్మెలు సత్యాగ్రహాలు మహోగ్ర ఉద్యమాలు
కోటానుకోట్ల నిష్టదరిద్రుల ఆకలి మంటల హాహాకారాల్ని
ఘాతుకంగా పరమ కిరాతకంగా
కాలరాస్తోన్న శత హస్త పాదాలతో
అపర కృష్ణావతారమైన అప్పలరాజు విశ్వరూపం ధరించాడు".
(పేజీ-32- విషాదభారతం.)

## కవితలేదనడం దృష్టిలోపమే!

ఇంతటి శక్తివంతమైన వర్ణనలు చూడలేకపోవడం దృష్టిదోషం, కవిత్వం లేదనడం అనుచిత నిర్ణయం. "ఎక్కడా మరోసారి మననంచేసుకోదగిన పదచిత్రం గానీ, భావనా పాటవంగానీ, ఉక్తివైచిత్రిగానీ లేకుండా" కావ్యం సాగిందన్నారు. ఆదిపర్వం, ఎన్నికల ప్రచారపర్వం, సభాపర్వం, మహాప్రస్థాన పర్వాల్లో శక్తివంతమైన పద చిత్రాలు మీకు కనిపించనేలేదా?! ఈ క్రింది కవితా ఖండికలు మనన సౌందర్యానికి ఆలవాలం గాదా?

"ప్రతీప శక్తుల్ని చెండాడి ప్రగతిని పరిరక్షించేందుకోసం
ప్రళయ రుద్రుడులాంటి నరుడు తెరుస్తాడు కవిత్వ త్రినేత్రం"
(నాంది- పేజీ-11)

"న్యూటన్ గ్రావిటేషన్ని ఐన్‌స్టీన్ రిలేటివిటీ అధిగమించినట్లు
నాటి అప్రకవీయాన్ని నేటి అనంత మానవత తోసిరాజంది
కవిత్వ తత్వాన్ని కుంచించటం
కడలి జలాన్ని ఐరదగుంటలోకి తోడయత్నించటం
కవిత పరిపూర్ధ్యాన్ని నిర్ధారించటం
గగన పరిధిని స్కేళ్ళబద్దతో కొలవ ప్రయత్నించటం" (నాంది)
ఈ క్రింది పదచిత్రాలు చూడండి:
"గత ఎలక్షన్లో గెలిచి అంతటితోనే
పత్తాలేకుండా అదృశ్యమైన ప్రజా సేవకులంతా
వాన వెలిసింతర్వాత నేలలోంచి పుట్టుకొచ్చే పుట్టకొక్కుల్లా
పుట్టలోంచి వొచ్చి పడగలు విప్పి ఆడే నాగుపాముల్లా
వొక్కొక్కళ్ళు బైటికొచ్చి
"సర్వాన్ని నిర్ణయించే సావరిన్ ప్రజల్ని"
తిరిగి సందర్శించేందుకు విసుగూ విరామం లేకుండా
రంగురంగుల కళ్ళద్దాలతో నంగనాచి కబుర్లతో
చెంఘిలించే తురంగాల్లా టూర్ జేసేస్తోన్నారు"
(ఆదిపర్వం- పేజీ- 12)

అవినీతికి మూలకందమై, అశేష ప్రజాసామాన్యాన్ని రాబందుల్లా దోపిడీ చేసే బహద్దరును (కావ్యంలో కథానాయకుణ్ణ) వర్ణించే ఈ పదచిత్రం కావ్యకర్త సునిశిత మేధాశక్తికి, ప్రతిభకూ గీటురాళ్లు.

"తాలూకాలోని పాటిదిబ్బలూ, గ్రామకంఠాలూ
బంజర్లూ దేవాలయ భూముల గుటకాయిస్వాహా దారు
కారుతోతప్ప కాలిబాటతో పనిలేనివారు
ఫోనుతప్ప పోస్టాఫీసు జోక్యం రానివారు
కాకితోకభుర్జే స్త్రీకరణం మునసబులు లగాయితూ
మంత్రులూ సామంతుల్లూ విషాద్ధ విదూషకుల్లా తయార్లు!"
"ఎండకన్నెరుగని సుకుమారులు
తమ దేహ శరీరం తమకే బరువై పోయిన దీర్ఘకాయులు!
వ్యాపారవర్గాల అభిప్రాయాల్ని ప్రజలకి తెలియజెప్పాలనే ఆసక్తి
నిరుపమానమైన దేశసేవానురక్తి,
కాడికింది జోడెద్దుల్లా పురికొల్పగా
ఊపిర్దాడకో వుండబట్టలేక ఎసెంబ్లీకి నిలబడి
ఊరూ సేడూ అవకండా గుడిసె గుడిసెకీ కొంప కొంపకీ
కాలికొ బలపం గట్టుక వొళ్లు అరిగేట్లు తిరిగేస్తోన్నారు!" (ఆదివర్వం)

వ్యంగ్య కవితా శోభహానికి-తెలుగు శుడికావానికి—

ఎన్నికల ప్రచారంకోసం వచ్చిన సినిమా యాక్టరు దృశ్యాన్ని వర్ణిస్తూ—

"బిందెలతో నీరు వారపోస్తూ మంగళహారతులిస్తూ
దేవుడిలా పూజిస్తోన్న మహిళామణులూ"
"ఎడైన గేదెల్లా యాక్టరు కారువెంట లగెత్తే
భావిభారత పౌరులైన యువక కిశోరాలూ"

(ఎన్నికల ప్రచారపర్వం-పేజీ-25)

ఎన్నికల ప్రచారార్థం వచ్చిన మహిళామంతలి లీడర్ని వర్ణించే ఈ పద చిత్రం నిసర్గ సుందరం—

"సిగలో పూలూ చేతిలో బ్యాగూ
ఒహో ఏం వాసన కమ్మకమ్మగా!
చేతికి వాచీ కాళ్ళకి కళ్ళకి జోడు
వెంటేసుకొచ్చింది ఎవరినో తోడు!
నయగారం వొలకబోస్తూ ఎన్నికల ప్రచారానికా?
కాక- అభిసారికా వేషంలో భేషైన శృంగారానికా?"
"ఇంటింటికీ తిరిగి బొట్టూ కాటికా పెట్టింది
గడపలకి పసుపురాసి తాంబూలం ఇచ్చింది
మరికొళుందు ఘుమాయిస్తోన్న గంధం గొంతుకి పూసింది
కరపత్రాలు పెద్దాళ్ళకి, కాయితం జెండాలు చిన్నాళ్ళకి పంచింది
తప్పక ఓటు చెయ్యాలి సుమా- అంటో
చేతిలో చెయ్యి వేయించుక థాంక్సుజెప్పి చక్కా వెళ్ళిపోయింది!"

(ఎన్నికల ప్రచారపర్వం- పేజీ-26)

బాబాగారిని గూర్చిన ఈ పద చిత్రం చూడండి-

"చీలమండల దాకా జీరాడుతోన్న కాటన్ సిల్కు లాల్చీ
లోపల కంచిపట్టు సుతిమెత్తని లంగోటి
జటాజూటాలు తెగపెరిగిన శిరం
జర్మన్ లిల్లిపుట్ నైఫ్‌తో నున్నంగా గీసిన గెడ్డం
అడ్డంగా మూడురేఖలూ నొసటమీద గంధం
అబ్బ! బ్రహ్మవర్చస్సుతో వీరభోగ వసంతరాయల తేజం!!
బాబాగారు సాక్షాత్తూ కలియుగ రసికేశ్వరావతారం!!!"

(ఎన్నికల ప్రచారపర్వం-పేజీ 27)

పద్దెనిమిదేళ్ళ స్వాతంత్ర్యం పిదపగూడా హృదయ విదారకమైన గర్భ దారిద్ర్యాన్ని అనుభవించే పేదల యిళ్ళను కావ్యకర్త వర్ణించిన తీరు చూస్తుంటే, శరీరం గగుర్పొడుస్తుంది-

✓ "కుళ్ళి కుక్క చచ్చిన కంపుగొడుతున్న
పెట్టుబడిదారీ సమాజ శరీరంమీద చీమూ నెత్తురూ కారుతూ
కుల కుల లాడే పురుగులు నిండిన కురుపుల్లాంటి పందుల గూడేలు" ✓
(విశ్వరూప సందర్శన పర్వం-పేజి 31)

ఈ విధంగా అత్యంత ప్రతిభావంతమైన కవితకి ఆలవాలమైన పద చిత్రాలు కావ్యంనిండా కనిపిస్తాయి. స్థలాభావంచేత వాటినన్నిటినీ ఇక్కడ ఉదహరించడం సాధ్యంకాదు.

"ఆడా మగా భేదం లేకండా అందరికీ రైట్-టు-ఓట్- వేల ఎకరాల సన్నకారు రైతు- మోకాట్లో తలకాయున్నా. నోట్లో నాలిక- సారా దీసేసి నీరా సరఫరా చెయ్యడం- అమోనియూకారు- ఇలా చెప్పాలంటే కోకొల్లలు; వ్యంగ్య కవితా వైభవానికీ- తెలుగు నుడికారానికీ మచ్చుతునకలు.

## సామాన్యజనంతో మనసా, వాచా ఐక్యతనుసాధించిన కవిత

విషాదభారతంలోనిది సిసలైన లౌకిక భాష. తెలుగు నుడికారం సొంపు ఇంపులకి ఈ కావ్యం నిలయం. పారంపర్యంగా వస్తోన్న కావ్యభాషకి సాధ్యమైనంత మేరకు దూరమై, లౌకిక భాషలో ఆమూలాగ్రం కావ్యరచన సాగడం ఇందులోవి ప్రత్యేకత. అంచేతనే ఈ కావ్యం పామరజనాన్నిసైతం బాగా ఆకర్షించగలుగుతోంది.

"ఉక్తివైచిత్రి లేకుండా శుద్ధవచనరీతిలో శయ్యాసారళ్యంతో అన్వయ శ్లిష్టతతో" కావ్యరచన సాగిపోయిందని మీరు బాధపడ్డారు! అన్వయశ్లిష్టత లేక అన్వయక్లిష్టతతో కూడి, పామరులకిగాక పండితులకి మాత్రమే అర్థమవగల పాషాణ పాకంలో రచన సాగిస్తే అది ఉత్తమ కవిత్వమని మీ భావమా-స్వామీ! విషాదభారతం పండిత పామరులిద్దరికొరకూ రాయబడిందే అయినా, ప్రధానంగా పామరజనాన్ని దృష్టిలో పెట్టుకొనే రాయబడిందని నే నర్థం చేసికొంటున్నాను. ఈ సత్యాన్ని గుర్తించిన పీఠికా రచయిత శ్రీ రమణారెడ్డి "తనకున్న విద్యాధిక్యతను బట్టబయలు చేసుకొంటూ, బడాయిలకు పోకుండా తన సంస్కారానికి లాంకోటూ, టాప్‌హేటూ పెట్టి హెచ్చులు చూపకుండా తన వ్యక్తిత్వాన్ని లోకంపై రుద్దకుండా బాధపడుతున్న సామాన్య జనంతోటి మనసా వాచా ఐక్యతను సాధించిన ఈ కావ్యకర్తని మెచ్చుకోకుండా ఉండటం ఆత్మద్రోహమేగాక, స్వజాతి జనులకు ద్రోహమని నా మట్టుకు నే ననుకుంటున్నాను. ప్రజామోదమే

అభ్యుదయ కావ్యాలకు కావలసిన మొహరు. అది ఈ కావ్యానికి తప్పకుండా వుంటుంది" అని కావ్యాన్నీ, కావ్యకర్తనీ సరిగ్గానే బేరీజు వేశారు !!

విషాదభారతంలో ఉక్తివైచిత్రి లేదని మీరు బాధపడ్డారు. ఉక్తివైచిత్రి, వ్యంగ్య కవితా వైభవం ఇత్యాదులు స్వీకరించిన ఇతివృత్తాన్ని ప్రధానంగా అంటిపెట్టుకొని వుంటాయి. అలా ఉండాలిగూడా. ఆరుద్రగారు కూనలమ్మ పదాల్లో ఇంటింటి పద్యాల్లో ప్రదర్శించిన ఉక్తివైచిత్రి నభూతో నభవిష్యతిగదా ?! ఇహ పతాభిగారు జ్యోతి మాస పత్రికలో ప్రచురించిన "పంచాంగం"లోని ఉక్తివైచిత్రిగూర్చి ఎంత తక్కువ రాస్తే అంత మంచిది. శ్రీ కేశవరావ్ రాసిన "ఉదయించని ఉదయం"లో ఉక్తివైచిత్రి టన్నులకొద్దీ దొరుకుతుంది. డైలాన్ థామస్‌కీ, జేమ్స్ జాయిస్‌కీ కార్బన్ కాపీతీసే, ఉక్తివైచిత్రి సమ్మిశ్రితమైన కవిత్వం మీకు విషాదభారతంలో మందుకైనా దొరకదు. భావ వ్యక్తీకరణలో అతివృష్టి అనావృష్టి అనే రెండు దోషాలు సామాన్యంగా ఉంటాయి. అతివృష్టి ఎక్కువైతే కవితా పదార్థం పల్చబడి శుద్ధవచనంలా తయారవుతుంది. అనావృష్టి ఎక్కువైతే ఆరుద్ర త్వమేవాహంలోని కొన్ని భాగాల్లా తయారై, మూలభావం మూలలో దాక్కొని, : తితకి ఎనాసిన్ అవసరాన్ని కలుగజేస్తుంది. ఈ రెండు దోషాలకి సాధ్యమైనంత దూరంగా వుండి, కవిత చెప్పగలగడం ఒక మహత్తర కళ. ఇది మహాకవి శ్రీశ్రీ లో సుమనోజ్ఞ సుందరంగా భాసించింది.

ఉక్తివైచిత్రిగూర్చి ఇంతగా మీరు రాశారు. అంచేత 8-3-65 నాటి విశాలాంధ్రలో ప్రచురించిన మీ "పునరుజ్వల"లోని ఉక్తివైచిత్రినిగూర్చి కొంచెం ప్రస్తావిస్తాను. ఉక్తివైచిత్రి, అంత్యప్రాసలకోసం అర్థగౌరవాన్నీ, భావ గాంభీర్యాన్నీ అడవిలో వదలి, శబ్దాలంకారాల ఊబిలో ఏ విధంగా కూరుకపోయారో ఈ క్రింది పాదాలు చూడండి :

"పూజించుకోవాల్సింది
ప్రమోదాన్నికాని ప్రమాదాన్ని కాదు"
"బంగారంతో పనేమి శృంగారమే మన సొమ్ము"
భ్రమించకమ్మాయీ పుడమీ నెచ్చెలీ
.... .... .... .... .... .... .... ....
నిర్లక్ష్యం చేయకమ్మాయీ పుడమీ చెలీ !

ప్రమోదానికి విరుద్ధమైంది ప్రమాదమా ? బంగారానికి విరుద్ధమైంది శృంగారమా ?! ఈ అర్థరహిత హేయపదప్రయోగంవల్ల మీరు ఏ ఉక్తివైచిత్రిని సాధించదలచారు ? అంబురాశికి లావణ్యాన్ని, అంబరానికి ధావళ్యాన్ని అంటగట్టడం ఉక్తివైచిత్రి కోసమేనా ?

"అతకరించు సమర సంఘాత లోక సంతాపాలను
అవధరించు భువనహితమైన మహోత్సవాలను ?"

సంస్కృతభాషలో ఓనమాలు నేర్చిన పిల్లవాడు సైతం మహోత్సవాలను అవధరించడు!! రామార్గామా- పై పాదంలో అతకరించుకుంది గాబట్టి, క్రింద అవధరించు దాపరించిందా?! ఏ అలంకార శాస్త్రంలో వేర్చుకొన్నారీ ఉక్తి వైచిత్రిగూర్చి? అర్థగౌరవ గారడీ కవిత్వం పుణ్యమా అని అంత్యప్రాసకి తెగ గిరాకీ పెరిగిపోయి, క్రమంగా ఇది వెర్రితలలు వేసి, కొందరు సుప్రసిద్ధ కవులతో సైతం శీఘ్ర కోడుగుడ్లు పెట్టిస్తోంది- ఇలాంటి ఉక్తివైచిత్రియేనా మీరు విషాదభారతంలో లేదని బాధపడుతున్నారు? అర్థగౌరవానికీ భావగాంభీర్యానికీ చోటులేని కవిత, కవితగాదు; కపిత. నిసర్గసుందరమైన కవిత, అలాంటి కవితలోని ప్రత్యక్షరమూ హృదయాన్నుండి దూసుకువస్తుంది. అలా గాకపోతే "వందర్ఫుల్ ప్రయోగించిన స్ఫూర్తిక్కు నిర్లక్ష్యబుద్ధిని సాధించుకొంటుంది" (శ్రీ రమణారెడ్డి)

## నేటి ఎన్నికల తంత్రాన్ని ఎక్సురేతీసిన కవిత

"...ఆలోవ వర్తమానకాలీన స్థితిగతుల రిపోర్టు కవిత్వం అవుతుందా!!" అని ఆశ్చర్యం ప్రకటిస్తూ ఒక ప్రశ్న వేశారు. వర్తమాన కాలీన స్థితిగతుల రిపోర్టు మాత్రంగానే విషాదభారతాన్ని మీరు పరిగణిస్తోన్నారా?! తమ జీవన సర్వస్వాన్నీ నిర్ణయించే అత్యంత పవిత్రమూ, అమూల్యమూ అయిన ఓట్‌ను అరసోలెడు బియ్యానికీ, ఐదురూపాయల నోటుకీ అమ్మేసుకొంటోన్న కోటానుకోట్ల ప్రజల నికృష్టదారిద్ర్యాన్నీ. ఆ దారిద్ర్యానికి కారణభూతులైన బడాచోరుల వంచననీ, వాను ఎన్నికలపేట యిన్నేళ్ళుగా కొనసాగిస్తోన్న మోసాన్నీ, నేటి విషాదభారతంలోని అంతర్ బహిర్ స్వరూపాలని, నగ్నంగా పాఠకలోకంముందు ఆవిష్కరింపజేసి, ఎన్నికల తంత్రాన్నంతా మనముందు నిలబెట్టి ఎక్స్-రే తీసి చూపిన ఈ కావ్యం మీకు రిపోర్టులా వుందా? అదే నిజమైతే మీ రాజకీయ పరిజ్ఞానస్థాయినీ, వర్తమాన ప్రజాతంత్ర వ్యవస్థయెడల మీ ధోరణినీ, శంకించ వలసిన స్థితిని మీరే కల్పిస్తున్నారు. పద్దెనిమిదేళ్ళ ప్రజాతంత్ర భారతంయొక్క అంతర్ బహిర్ స్వరూపాల్ని ఎంతో ప్రతిభా సంపన్నంగా విషాద-భారత మొక్కటే చిత్రించిందంటే అణుమాత్రమైన అతిశయోక్తిగాదు. అంచేతనే ఈ ఉత్తమ కావ్యం ప్రత్యక్ష రాజకీయాలతో సంబంధమున్నవారి దగ్గరనుండి, సుప్రసిద్ధులైన కవులూ సాహితీ విమర్శకులవరకూ అందరి ప్రశంసలకి పాత్రమైంది. విషాదభారతం వాస్తవమైన అభ్యుదయ కవితకి సజీవ ఉదాహరణ కావ్యంలోని ప్రధానపాత్రలైన అప్పలరాజూ, బహద్దరూ. వీరిదరూ-యిద్దరు వ్యక్తులుకారు. "వర్తమాన భారతావనిలోని నిరంకుశ పాలక వర్గానికి, వూరూరా వెలసిన ప్రతిరూపానికి రెండు హస్తాలు. "ఈ కావ్యంలో, నేటి విషాదభారతాన్ని చూచి, ఆవేశం క్రోధం సమ్మిళితమై ముందు నిలచాయి. ప్రస్తుత పతనానికి కారణాలను చాలవరకు వ్యక్తీకరించడం గూడా జరిగింది. సామాన్య మానవుని నిరాశామయ, నికృష్ట జీవితాన్ని ప్రతిబింబించడమూ జరిగింది.

"మహోత్కృష్ట మానవతా సిద్ధాంతంకోసం
కోట్లాది నిష్టదరిద్రుల బతుకుల్లో
అపూర్వ వసంతాలు విరబూయించేందుకోసం
భూమికై భుక్తికై మానవ విముక్తికై
అనేకానేక వీరోచిత పోరాటాల్లో ఆహుతవుతూ
జైళ్ళనీ తుపాకి గుళ్ళనీ ఘోరహింసల్నీ నరక యాతనల్నీ
తమకై తామే వరించి శిలువమీది జీసస్‌లా బలిఅవుతూ
జాతీయ స్వాతంత్ర్య గౌరవ ప్రతిష్టల్ని
అడుగడుగునా పరిరక్షించే
వజ్రాల్లాంటి నేలతల్లి ఉత్తమోత్తమ పుత్రులు
దేశద్రోహులుగా పరిగణింప బడుతూంటే-
నానా కుంభకోణాల్లో సిగ్గుమాలిన లాలూచీల్లో అప్రతిష్టపాలై
ధనం మూటల బూట్లు నిస్సంకోచంగా మోసే
విదేశీ స్వదేశీ కుబేరుల తాబేదార్లూ
బ్రిటిష్ సామ్రాజ్యవాదుల గతకాలపు బంట్లూ
సబ్బుల కంపెనీల ఏజంట్లూ
దేశభక్తులుగా చలామణీ అవుతూంటే
దేశం తనను జూచి తానే తనలో వెర్రిగా నవ్వుకుంటోంది."

అని ఎవరు దేశభక్తులో, ఎవరు నకిలీపరుకో కుండబద్దలుకొట్టి చెప్పడమూ జరిగింది. "ఏది ధర్మమో, ఏ దధర్మమో ఆలోచించి మరీ గద్దె నెక్కించండి" అని మార్గనిర్దేశనా జరిగింది. అంతేకాదు; "బ్రిటిష్ సామ్రాజ్యవాద శునకాల్ని తరిమి వేసిన వీరోచిత పోరాటాలనాటి శతకోటి భానుల ప్రభాభాసురమైన మహోజ్వల చైతన్య విలసితులై నలభైకోట్ల పిడికిళ్ళని వొక్కుమ్మడి బిగించి భూనభోంత రాళాలు దద్దరిల్లిపోయేట్లు మీ వాంఛల్ని ప్రతిధ్వనించండి" అంటూ దిక్కు దోచక నీరసపడే క్రాస్‌రోడ్‌లోని సామాన్య మానవుని శట్టి మేల్కొలిపి, కర్తవ్య ప్రబోధం గావించడమూ జరిగింది. ఈ జాగృతే మన స్వేచ్ఛకు శ్రీరామరక్ష.

అతి సూక్ష్మ విషయాల పట్లకూడా ఎంతో పరిశీలనాత్మక విమర్శ చేయడం ఈ కావ్యంలో మనకు అడుగడుగునా కనిపిస్తుంది; ప్రత్యేకంగా మహాప్రస్థాన పర్వంలో. ఇందులో కుహనా సంస్కారవంతులకీ, మర్యాదస్తులకీ ఏ మాత్రం మర్యాద యివ్వలేదు. కావ్యకర్త కంటి జీరా, ముక్కుపుటాల అదురూ రచనలో కనిపిస్తుంది. ఆవేశాన్ని దిగమ్రింగుకుని, ఆ తరువాత సావకాశంగా ఏ చెట్టు నీడనో నెమరు వేసుకుంటుంటే వచ్చిన నురుగుకాదు-ఈ కావ్యం. కట్టలు తెంచుక

పొంగి వచ్చిన ఉద్రేకాన్ని, మూసలో పోయగా రూపుకట్టిన కణికలు ఈ కావ్య ఖండికలు. అంచేతనే, గణాలూ యతులూ ప్రాసలూ ఆఖరికి ఆధునికులు క్రొత్తగా అభిమానిస్తున్న అంత్యప్రాసలు సైతం పక్కకి తప్పుకున్నాయి. ఈ కావ్యం చదివిం తర్వాత, సాహిత్యం అన్నది ఎన్ని పోకడలు పోతుందో, ఎన్ని తరహాలుగా ముస్తాబుకాగలదో గ్రాహ్యం అవుతోంది.

సాహిత్యంలోనూ సైంటిస్టులు కావాలి. కొత్త పుంతలుతొక్కే, రచయితలకి స్వాగతం పలకాలి. కావ్యంలో, అర్థవత్తు, సద్యస్స్ఫురణ, ఎవరిని అధిక్షేపిస్తున్నారో, ఎవరిని గర్హిస్తున్నారో ఆ వ్యక్తుల్నీ ఆ వర్గాలనీ కళ్ళకి కట్టిస్తున్నాయి. విషాద భారతం కవిత, మేధోజనిత నిర్మాణంకాదు. అంత్యప్రాస విలాపాల, దొమ్మరిఫీట్ల సర్కసూ కాదు.

## మంచిని ప్రేమించడం- చెడును ద్వేషించడం అభ్యుదయ కవిత లక్షణం

మంచిని గాఢంగా ప్రేమించడమన్నది ఒక గొప్ప సుగుణం. చెడును తీవ్రంగా ద్వేషించగలగడంకూడా తత్తుల్యమైన సుగుణమే. ఇదే ఈ కావ్యంలో కనిపిస్తుంది. సులక్షణ సారమూ, అప్పకవీయమూ, రసగంగాధరమూ పంచ కావ్యాలూ చదివితే ఇలాంటి రచన చేయడం సాధ్యంకాదు. అంచేతనే శ్రీ రమణారెడ్డి కావ్యకర్త వట్టి సాహిత్యోపజీవులు కారని అన్నారు. లోకంమీద అన్ని వేపులకీ సెర్చిలైట్లు వేసి, పరిస్థితుల్ని చీల్చిచూచి, ఆధునిక విజ్ఞాన భాండారాన్ని అంతకు కొంత కొల్లగొట్టి, ముందుచూపుతో ముందుకునడిచే రచయితకే ఇలాంటి రచన సాధ్యమవుతుంది. సామాజికంగాగానీ, రాజకీయంగాగానీ నిర్దిష్టమైన ఏ అభిప్రాయమూలేక, గాలిపటంలా ఊగులాడే మనుషులూ, ఎవరికి కోపం వస్తుందోనని గుండెలు చేత్తోపట్టుకొని పిల్లిపిల్లలా అడుగులువేస్తో నడిచే భయస్థులూ, ప్రపంచాన్ని వొదిలి తోకముడిచి మబ్బుల్లో దాక్కునే మందబుద్ధులూ, వర్తమాన సమాజాన్ని గర్హించి, ద్వేషించి, రోషంగా ఒక గ్లాసుడు మంచినీళ్ళు తాగేసి, పడుకుని, లేచి, సావకాశంగా యతిప్రాసలతో బిగించి, ఆ కోపాన్నీ, ద్వేషాన్నీ నాటకంలోని నటుడు నీలాంబరి రాగంలో ఏడిచినట్టు, శాస్త్రయుక్తమైన కవిత్వాన్ని రాసేవారూ విషాదభారతంలోని అంతస్థులు అందుకోలేరు. కావ్యకర్త ఆగ్రహానికీ, ఆవేదనకీ రూపుగట్టిన సజీవ సాహితీ స్వరూపం ఆ కావ్యం. ఎంత బాధపడ్డారో, అంత బాధా, ఎంత కోపమొచ్చిందో అంత కోపమూ, ఎంత జుగుప్స కలిగిందో అంత జుగుప్సా బీరుపోకుండా ఈ రచనలో కావ్యకర్త ధట్టించి విడిచారు. ఇది సాహిత్యంలో సామాన్యమైన ప్రయోగం కాదు.

# 35

## రమణారెడ్డిగారు చెప్పింది అక్షరాలా సత్యం

ఈ కావ్యంలో చాలామందికి చాలా దెబ్బలు తగిలాయి. ఎక్కడెక్కడ తగిలాయో ఎవరికి వారే చూచుకోవాలి. ఏ ఏ ఘట్టంలో ఎవరికి కావ్యకర్తపై కోపం వచ్చిందో ఆరా తీసుకుంటే, అక్కడక్కడల్లా ఆ ఆసామీకి ఇష్టంలేని ఒక చేదు నిజాన్ని తుపాకీ దెబ్బలా వొదిలారని ఊహించవచ్చు. అంచేతనే శ్రీ రమణారెడ్డి "ఈ కావ్యాన్ని చదువుతూంటే, నా దేశం, నా కాలం నా కళ్ళకు కట్టినట్లయింది. కావ్యకర్త తాను కరిగారు నన్ను కరిగించారు. దేశంలో పెచ్చరిల్లిపోతున్న నిరంకుశ ధోరణులు, ఓట్ల పండగలో జరిగే దగాలూ, దౌర్జన్యాలూ, కొండెక్కుతున్న జీవన సౌఖ్యాలను ఎగసనదోసే తెన్నుగానక తిరుపతులకూ, అన్నవరాలకూ, పుట్టపర్తులకూ చేస్తున్న యాత్రలు, డబ్బు కక్కుర్తికి పౌర సత్వాన్ని అమ్ముకోవలసివస్తున్న వైపరీత్యాలు- విషాదం మూర్తీభవించిన భారతదేశం ప్రత్యక్షమౌతున్నది. స్వరాజ్యలక్ష్మి మాచకమ్మగా పరిణమించినప్పటి బాధ కావ్యకర్తనీ, నన్నూ ఏకం చేయగలుగుతున్నది" అని రాసి, ప్రత్యక్షర సత్యాన్ని ప్రతిపాదించారు.

"శుద్ధ వచన రీతిలో శయ్యాసారళ్యంతో, అన్వయశ్లిష్టతతో సాగిపోయింది. ఈ గుణం గొప్ప వచనానికి కిరీటం తొడగవచ్చుగాని, గొప్ప కవిత్వానికిమాత్రం గాదు. కనుకనే ఈ మీ విషాదభారతం పాదాల తుంపులు తొలగించినా, ఇబ్బంది కలగని గొప్ప వచనమేగాని, గొప్ప కవిత్వం కాదని నా నిస్సందేహమైన అభిప్రాయం" అని మీరన్నారు ! ఒకవైపున కావలసినంత వచన కవిత్వాన్ని మీరు రాస్తూ, దానినే రాస్తున్నవారిపై మీరు రాంబాణాలు వేయడం ఎంత హేతుబద్ధమో వేరే చెప్పనవసరం లేదు ! అయితే, మీ రచనల్లో శుద్ధమైన వచనకవిత్వం, విషాద భారతంలో పాదాల తుంపులూ మీకు కనిపిస్తే అందుకు ఎవరూ ఏమీ చేయలేరు ! వచన కవితా సంవిధానంపై శ్రీయుతులు గోరా శాస్త్రి, సుగుణ (ఆంధ్రభూమి), గోల్కొండ, భారతి మాసపత్రికలోని "శాక్యసింహ" ప్రభృతులు చేసిన పాత పాచి విమర్శనే మీరూ చేస్తోన్నారు. స్థలాభావంచేత ఆ వివరాల్లోకి పోయేందుకు ఈ జాబులో అవకాశం లేదు. సులభంగా స్టేట్‌మెంట్లని మీ లేఖనిండా విసిరి పారేసిన మీరు, గొప్ప వచనానికీ, గొప్ప కవిత్వానికీ మధ్య వుండవలసిన మౌలికమైన భేదాన్ని వివరించి పిదప విషాదభారతంలో గొప్ప కవిత్వం లేదన్నా సహేతుకంగా ఉండేది. కనీసం ఆ పనిగూడా మీరు చేయలేదు. "ముక్తచ్ఛంద కవిత- ఒక పరామర్శ" అనే పేరుతో "నవత" పత్రిక తృతీయ సంచికలో మీరు రాసిన వ్యాసంలోగూడా ఈ పని చేయలేదు. ఏ విషయాన్నిగూర్చీ లోతుగా సహేతుకంగా ఆలోచించి వివరించలేకపోవడం మొట్టమొదటనుంచీ మీ ప్రత్యేకత!

అభ్యుదయ సాహితీ ప్రక్రియలగూర్చి అధికారికంగా చెప్పగలిగిన మహాకవి శ్రీ శ్రీ ఈ మధ్యనే కావలి కళాశాల జవహర్ భారతిలో- వెలిబుచ్చిన అభిప్రాయాలు మీవంటివాళ్ళ కళ్ళను తెరిపించగలవు. ఆయ నిలా అన్నారు :

"తాను గద్యం వ్రాస్తున్నానని చాలామందికసలు తెలియదని, తన గద్య రచన లిటరరీ టేస్టు ఉన్నవారిని మాత్రమే అపీల్ చేస్తుందని, తా నొక సారి భీమవరంలో తన పద్యాలను చదువుచున్నప్పుడు ఒక పిల్లవాడు విని, ఒహో అలాంటి పద్యాలు తాను వ్రాయగలనని అన్నాడని, ఆ పిల్లవాడు అన్నట్లు కవిత్వం అందరూ వ్రాయగలగాలని, వ్రాయాలని తన అభిమతమని ఆ సంఘటన తనకొక వ్యక్తిగత విజయమని అన్నారు." (12-12-65న కావలి కళాశాలలో మహాకవి శ్రీ శ్రీ కవితాగోష్టి— 19-12-65 విశాలాంధ్ర). శ్రవణ సుభగత్వమూ, అంతర్లయా ప్రధానంగా గొప్ప కవితకి లక్షణాలు.

"నల్లమందులాంటి గంజాయ్ దమ్ములాంటి
భంగు విషాలాంటి సారా కైపులాంటి
చేతబడిలాంటి దయ్యం భయంలాంటి
గాఢ సుషుప్తిలాంటి మూఢ మత విశ్వాసంలాంటి
నేటి నిస్తేజ నిర్వీర్య ఉదాసీన చైతన్య శూన్య
నిర్లిప్తతలనుండి తిరిగి మేలుకోండి."

(మహాప్రస్థానపర్వం- పేజీ 44)

ఇంత బలంగా రాయబడిన భాగాలు కావ్యంనిండా కావలసినన్ని. దాదాపు రెండు దశాబ్దాలకితం ప్రథమ, ద్వితీయ, తృతీయ తరాలకి చెందిన అభ్యుదయ కవులు ఏ మహోజ్వల లక్ష్యాలకోసం నిలబడ్డారో, వాటిని మీరూ, మీవంటి మరి కొందరూ మర్చిపోయారు ! లేదా విసర్జించారు. వీరిలో కొందరు నేటికీ "అభ్యుదయ" తొడుగును ఇంకా తొడుక్కొనే చలామణీ అవుతున్నారు ! అసలు అభ్యుదయ సాహిత్యోద్యమమే నేడు తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. శిల్పంపై ఎంతో రాసిన మీరు, మీ జాబులో విషాదభారత కావ్యేతివృత్తాన్నిగూర్చి ఒక్క మాట సైతం చెప్పకపోవడం యాదృచ్ఛికంగాదు ! ఆ విషయంలోకి వెళ్ళితే మీ కలరూపు బయటపడుతుంది మీరు దాడిచేస్తోంది విషాదభారతంపై కాదు ! సిసలైన అభ్యుదయ కవిత్వంమీదా, త్రికరణశుద్ధిగా దాన్ని అనుసరించే రచయితల మీదా ! ఈ దాడి యాదృచ్ఛికంగాదు- ఉద్దేశ్యపూర్వకమే !! చాలాకాలంగా అభ్యుదయ కవిత్వాన్ని ఆవరించిన జడిమను విషాదభారతం వదిలించివేసింది. అభ్యుదయ సాహితిలోని ఎర్రకణాలు, మానవత తెల్లకణాలూ గలిగిన రక్తం ప్రవహిస్తున్న పిడికిలి మళ్ళీ బిగుసుకుంది !

# నాంది

నాటి వ్యాసభారతం పద్దెనిమిది పర్వాలు
నేటి విషాదభారతం ఎనిమిది పర్వాలే!
మదోన్మత్త నితాంత నిరంకుశాధికారంతో
సూది మోపినంత నేలనైనా ఇవ్వని రారాజులు నాడుంటే
వేలాది వేల ఎకరాల భూమాతను
తమ ఉంపుడుకత్తెను జేసుకొని
గంజిదాగడానికైనా గతిలేని కోట్లాది జనతా సందోహం కడుపులు
నిలువున మాడ్చేసే భూస్వాములూ బహద్దర్లూ నేడున్నారు
నాటి కుట్రలూ కుహకాలూ శకుని మామల ఎత్తుకు పైఎత్తులూ
దుశ్శాసనులచే ద్రౌపదీ మానభంగాలూ
రాజకీయాలలో రంకువేషాలూ నేడూ పొడసూపాయి
నాడులా నేడుగూడా నాడులో నిర్వక్ర పరాక్రమంతో
ధర్మం కొరకు పోరాడే అభినవ అభిమన్యులు తలయెత్తారు
ధర్మాధర్మాలమధ్య న్యాయాన్యాయాలమధ్య
సత్యాసత్యాలమధ్య నీతి అవినీతులమధ్య
నాడులా నేడుగూడా జరుగుతోంది భీషణ సంగ్రామం
ధర్మ సంరక్షణార్థం అధర్మ వినాశనార్థం
ప్రతీప శక్తుల్ని చెండాడి ప్రగతిని పరిరక్షించేందుకోసం
ప్రళయరుద్రునిలాంటి నరుడు తెరుస్తాడు కవిత్వ త్రినేత్రం.

న్యూటన్ గ్రావిటేషన్ని ఐన్‌స్టీన్ రెలిటివిటీ అధిగమించినట్లు
నాటి అప్పకవీయాన్ని నేటి అనంతమానవత తోసిరాజంది
కవిత్వ తత్వాన్ని కుదించడం
కడలి జలాన్ని బుదరగుంటలోకి తోడయత్నించడం
కవిత సరిహద్దుల్ని నిర్ధరించడం
గగన పరిధిని స్కేలుబద్దతో కొలవ ప్రయత్నించడం
మెదడులో హైపొయిడ్ వేడి + హృదయం వ్రయ్యలయ్యే
బాధ=త్రినేత్రంలాంటి కవిత్వం
శోకమే శ్లోకమైనట్లు బాధే కవిత్వానికి పర్యాయపదం
ఇదే మహాప్రస్థాన గీతాచార్యుని నిత్యనూతన కవితా నిర్వచనం.



# 1. ఆదిపర్వం

వొఖ రక్తం బొట్టుగూడా చిందకండా
అహింసామంత్రజపంవల్లనే అమాంతం జాతికి స్వాతంత్ర్యం రాగా
తెల్లదొర సీట్లో నల్లదొర భేషుగ్గా ఆసీనుడయ్యాడు
పరమోత్కృష్ట ప్రజాతంత్ర రాజ్యాంగచట్టం
ప్రసాదించింది ఆడా మగా తేడాలేకండా
అందరికీ రైట్ టు వోట్!

అయిదు సంవత్సరాలు గిర్రున తిరిగాయి-
తిరిగి జనరల్ ఎన్నిక లొచ్చాయి
గత ఎలక్షన్‌లో గెల్చి అంతటితోనే
పత్తాలేకండా అదృశ్యమైన ప్రజాసేవకులంతా
వాన వెలిసింతర్వాత నేలలోంచి పుట్టుకొచ్చే పుట్టకొక్కుల్లా
పుట్టల్లోంచి వొచ్చి పడగలువిప్పిఆడే నాగుపాముల్లా
ఒక్కొక్కళ్లు బైటికొచ్చి
"సర్వాన్ని నిర్ణయించే సావరిన్ ప్రజల్ని"
తిరిగి సందర్శించేందుకు విసుగూ విరామం లేకండా
రంగురంగుల కళ్ళద్దాలతో నంగనాచి కబుర్లతో
చెంగలించే తురంగాల్లా టూర్ జేసేస్తోన్నారు
దేశ నాయకులూ దేశభక్తి యూనియన్ల సేవకులూ

సినీరంగం హీరోలూ చిత్రజగత్తులోని అగ్రతారలూ
ధర్మోపదేశకులూ బాబాలూ బిషప్పులూ
సాములోర్లూ పూజ్యగురూజీలూ
మహిళామండలి లీడర్లూ మందినిముంచే ప్లీడర్లూ
నియోజకవర్గాలచుట్టూ రంకులరాటాల్లా గిరాగిరా తిరిగేస్తోన్నారు :
ప్రజల్ని సుడిగుండాల్లా చుట్టుముట్టుతూ
నిలువున ముంచేసేందుకు శతథా యత్నిస్తున్నారు : :
యిట్ల నాసీజన్‌పో ఓట్ల పండగొచ్చింది
అలగా జనంతో మళ్ళీ మాయదారి పని దాపరించింది :

వీరవెంకట సత్యనారాయణ వరప్రసాద నారసింహ బహద్దరు
పూర్వాశ్రమంలో బ్రిటిష్ రాయల్ ఫ్యామిలీకి మోస్ట్‌లాయల్ సర్వెంట్
షుగర్ ఫ్యాక్టరీల వోనరు వో డజన్ రైసుమిల్లుల కంట్రాక్టరు
కమర్షియల్ బ్యాంకులకి ఛైర్‌మన్ దినపత్రికల్లో పావలా వాటాదారు
తాలూకాలోని పాటిదిబ్బలూ గ్రామకంతాలూ
బంజర్లూ దేవాలయ భూముల గుటకాయిస్వాహాదారు
కారుతోతప్ప కాలిబాటతో పనిలేనివారు
ఫోనుతప్ప పోస్టాఫీసు జోక్యంరానివారు
కాకితో కబురుజేస్తే కరణం మునసబులు లగాయితూ
మంత్రులూ సామంతులూ విషాద విదూషకుళ్ళలా తయారు :
వేల ఎకరాల సన్నకారు రైతు
నాలుగు దేవాలయాలకి ధర్మకర్తలు
కొత్తగా ఖద్దరు మతం పుచ్చుకొన్న దేశసేవాతత్పరులు
భారత పారిశ్రామిక వాణిజ్య మండలిలో
అగ్రశ్రేణి గుత్త వ్యాపార ప్రతినిధులు
వ్యాపార వర్గాలు చేతులు ముడుచుకుక్కూర్చునే విధానం మాని

"ప్రజారంగం"లో ప్రవేశించాలని
తహతహలాడే ప్రజాసేవా దురంధరులు
కమ్యూనిస్టు సిద్ధాంత జాడ్యం మహమ్మారిలా వ్యాపించకండా
"అర్హులైన" ఆల్ పార్టీ ప్రజాప్రతినిధులకి
చేతికొద్దీ ఎన్నికల విరాళాలిచ్చే అపర దానకర్ణులు
మోకాట్లో తలకాయున్నా చుట్టుపక్కల ప్రజలనోట్లో నాలికలాంటివారు
ఎండ కన్నెరుగని సుకుమారులు
తమ దేహ శరీరం తమకే బరువై పోయిన దీర్ఘ కాయులు।
వ్యాపార వర్గాల అభిప్రాయాల్ని ప్రజలకి తెలియజెప్పాలనే ఆసక్తి
నిరుపమానమైన దేశసేవానురక్తి
కాడికింది జోడెద్దుల్లా పురికొల్పగా
ఊపిరాడక వుండబట్టలేక ఎసెంబ్లీకి నిలబడి
ఊరూనాడూ అనకండా గుడిసె గుడిసెకీ కొంప కొంపకీ
కాలికి బలపంగట్టుక వొళ్ళు అరిగేట్లు తిరిగేస్తున్నారు।
బాజాలు వాయించండర్రా। భజంత్రీలు బజాయించండర్రా।।
ఇంటింటికీ వెళ్ళి ఈ శుభవార్త చాటింపేసి రండర్రా।।।



# 2. సభా పర్వం

"ఏ వూరునుండొచ్చినారూ
తమరు ఈ వూరి కెందుకొచ్చారూ ?"
ఆశ్చర్యపోతూ అడిగారు ప్రజలు
"ప్రజాసేవ చేయడానికి ఎసెంబ్లీకి నిలబడుతున్నా
పవిత్రమైన మీ ఓటు ఇచ్చి
ధన్యుణ్ణి జేయమని ప్రార్థిస్తోన్నా"– బహద్దరు
"సారవాకి నీరులేక సతమతమైపోతున్నాం
శిస్తులతో జప్తులతో పస్తుమాడి సస్తున్నాం"
"సారా దీసేసి నేరుగా నీరా సరఫరా జేస్తోన్నారుగా ?"
ఎర్రకారం పచ్చడిలా ఎరుపుకు దిరిగున్న కళ్ళు !
"అదేట బాబూ? సారాగాదు సారవా దాళవా"
"ఓహో అదా ? నందికొండ పారుతుంది బంగారం పండుతుంది"
"అయ్యా మా వోడు మిటిక్లీసన గెల్సి మూడేళ్ళయింది ఏదన్నా నౌఖిరి"
"బియ్యం కిలో రూపాయి పావలా – నూకలో రామచంద్రా"
"ఓ యస్ అదెంతపనీ ? అప్లికేషన్ బెట్టమను రికమండేషన్ జేస్తాం"

"మంచినీళ్ళ బావిలేదు బండిబొయ్యే బాటలేదు"
"ఊర్లో రోడ్డూ కాలవలో వొంతెనా మరమ్మత్తు జేయిస్తాం
పాడుబడ్డ గుళ్ళకి మూలబడ్డ మసీదులకీ వెల్లవేయిస్తాం
భూసంస్కరణలు అమలు జరిపించి బంజర్లూ బుల్‌దోజర్లూ పంచేస్తాం"
"అబ్బ ! ఎంత దయో దోసకాయపై పంతంబున చెక్కుదీసి పరపరగోస్తే
తింటానికి కూళ్ళేదు – బుల్‌దోజర్లిస్తాడంట– బుల్‌దోజర్లు–
ఉపస్థ మినహా కన్యాదానవన్నట్లు" వీపు గోక్కుంటూ గొణిగాడు శాస్తుర్లు :
"అయ్యబాబోయ్ ఏం లేత సొరకాయలు గోస్తున్నాఁడా ?"
చుట్టపీకుతా దీర్ఘం తీశాడు తలగుడ్డ ముసిలాడు
"బావులు పూడ్పిచ్చి గోతులు తవ్విస్తాం"
"అదేటి బాబూ ?"
"ఛా ఛా బావులు తొవ్వించి గోతులు పూడ్పిస్తాం" అంటుండగానే
గుంపులోనుండి ముందుకు రాకెట్‌లా దూసుకొచ్చాడు వో యువకుడు
"పండిస్తానికి నేలా కడుపునిండా తిండీ
ఉండేందుకు ఇల్లూ చదువుకి యిస్కూలూ చేసేందుకు పనీ...."
"బావా అప్పుఁలాజూ చెరిగిన క్రాపూ చేతిలో పేపరూ కళ్ళజోడు
ఎవడు వీడు పసనాభి గాలికి బుట్టిన కామరేడులాగున్నాడు"– బహద్దరు
"కళ్ళకి కావరం ఎగదన్నివ కారుకూతలు కుయ్యబాకు" యువకుడు
"ఊః ...." గాండ్రించి చెయ్యెత్తారు బహద్దరు
"కార్లో కుక్క వెనక్కి దోలండఁరా"
వెనకున్న యువకులు హడిలేట్లు అరిచారు
ముసలీ ముతకా కలగజేసుకొని వెనక్కి నెట్టేశారు

మునసబుగారింట్లో బహద్దరు మకాంబెట్టి
సాయంత్రం ఎన్నికల సభ ఏర్పాటు జేశారు.

*   *   *   *

"సోదర సోదరీమణులారా స్వతంత్ర భారత పౌరులారా!
ప్రజాతంత్ర భారత ఓటుహక్కుదారులారా"
బహద్దరు కాయితం చదవడం మొదలెట్టాడు!
"దేశంలో గాంధీజీ కలగన్న రామరాజ్యం రావాలి".
"రామరాజ్యమా కామరాజ్యమా?" కేక!
"నెహ్రూజీ చెప్పిన సోషలిస్టు తరహా సమాజం నిర్మించాలి"
"మీరు గాంధీయిస్టా సోసలిస్టా" పెద్ద - కేరింతలు!
"మీటింగు మధ్యలో అడగ్గూడదు తర్వాత చెబుతాం"
రాసుకొచ్చిన కాయితంలో లేదుగావును!" పెద్దగా నవ్వులు
"పంచాయతీరాజ్యమూ పంచవర్ష ప్రణాళికలూ
సింద్రీలో ఎరువులూ పింప్రీలో మందులూ
పెరంబూర్ రైళ్ళు బెంగుళూర్ విమానాలు
భాక్రా నంగలూ నాగార్జునసాగరూ తుంగభద్ర చంబలూ
భిలాయ్ బొకారో ఉక్కుకర్మాగారాలూ
అబ్బ- ఏం అభివృద్ధో-
ఏ దేశంలో ఇట్టాంటి ప్రగతి శరవేగంతో జరుగుతూందో చెప్పండి!
ఊరూరా ఆస్పత్రులు కావలసినంత ఆహారం
మేలిరకం విత్తనాలు క్రిమినాశక ఔషధాలు సమాజ వికాస పథకాలు
దళారీ పద్ధతి నిర్మూలనం సహకార వ్యవసాయం
సాలీనా తెగపెరిగే జాతీయాదాయం
నానాటికి తరుగుతోన్న నిరుద్యోగమూ
మోటారుకార్లు రేడియోలు ఎలక్ట్రిక్ బల్బులు పంకాలు సైకిళ్ళు
స్వయం సహాయం త్యాగబుద్ధితో కష్టించి పనిజేస్తే సుష్టుగా తినొచ్చు"
సోషల్‌స్టడీస్ టెక్స్టుబుక్ చదివే

హైస్కూలుస్టూడెంట్‌లా బహద్దరు గబగబా చదివేశారు।
ఎగశ్వాస దిగశ్వాసలతో తెగ రొప్పుతున్నారు
అప్పల్రాజు అందించిన గ్లాసుడు నీళ్లా
అమాంతం తాగేసి తిరిగి ప్రారంభించారు-
"ఆహార ధాన్యాలు అమెరికాలో కొంటే
వ్యాపార సంబంధాలు- లావవుతాయ్
పన్నులు ఎక్కువైతే ప్రణాళికలు విజయవంతమౌతాయ్
అభివృద్ధి కార్యకలాపాల నిర్వహణకి ప్రజలు
అదనం పన్నుల భారాన్ని భరించాలి"
"రాజభరణాలు బంద్‌జేసి ఎగేసిన
కోట్లాది ఆదాయం పన్ను పకడ్‌బందీగా వసూలుచెయ్యండి
భూసంస్కరణలు అమలుజరిపి బంజర్లు పంచండి
బ్యాంకులు జాతీయంచేసి వొచ్చిన కోట్లతో
ప్రణాళికల్ని జయప్రదం చెయ్యండి"- యువకుడు
"మీటింగ్ జరుగుతోంటే అడ్డుసవాళ్ళువెయ్యడం సభా సాంప్రదాయమా?"
"మందిని ముంచే అబద్ధాలు కూస్తూ మోసంజేయడం సబబా?"
"శాంతిభద్రతలకోసం పోలీసుల్ని పిలిపించాలా?
దేశ రక్షణచట్టంకింద జైల్లో కుక్కించాలా?"
"దేశ రక్షణచట్టంకింద జైళ్లల్లో
కుక్కించడానికే ఇక్కడి కొచ్చావా?"- యువకుడు
"నూకలో రామచంద్రా............" పెద్దపెద్ద కేకలు।
"శాంతంగా వుండండి - చైతన్యవంతులైన మీరు నాకే.... ఛా ఛా
మహాత్మాగాంధీగారు చెప్పినట్లు మీ వోటు నాకే ఇవ్వండి"
"చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకోండి।" అరుపులు ఈలలు
మీ పవిత్రమైన ఓటు బహద్దరువారికే ఇవ్వండి
సభ ముగిసింది దయచేసి అంతా ఇంటి కెళ్ళండి।"



# 3. ఊసరవెల్లుల పర్వం

బహద్దరువారి పెర్సనల్ అసిస్టెంట్ అప్పల్రాజు
వో పొద్దుతిరుగుడు పువ్వు – వాహ లిటిల్ ప్రొఫ్యూమో
ఆ చుట్టుపక్కల వూళ్ళల్లో అతగాడి పేరు జెబితే
పసిపిల్లలు పాలూ దాగరు; మగనాళ్ళు ఆదమరిచి నిద్రాపోరు।
కలిసొచ్చే రోజొస్తే నడిచొచ్చినట్లు
లక్ష్మి పాలు పొంగినట్లు పొంగగా
ఏడుకొండలపైన గుండు గొరిగించి
అన్నవరంలో సత్యనారాయణస్వామి వ్రతంగూడా జేశాడు
కొత్తగా కొన్న "అమోనియా కొను"లో పోతూ
అమాంతం ఆరు జీవాల్ని మింగేసిన ఈ ఘాతకుడు
పుటపర్తి సత్యశాయిబాబా శివరాత్రినాడు
నోట్లోనుండి తీసిన బంగారం లింగాన్ని భద్రంగా దాచుకొన్నాడు।।
భూమి తనఖా బ్యాంకికి ఆరువేలూ
పంచాయితీ సొమ్ము పదివేలూ పానకాలరాయుడిలా మింగినా
శిస్తుబకాయి నాలుగువేలున్నా వొంటిమీద ఈగైనా వాల్దు।
ఆఫీసర్లూ దేశ నాయకులూ వొస్తే డజన్లకొద్దీ కోళ్లూ గాజురొయ్యలూ
బ్రాందీ విస్కీ బాటిల్సూ బిరియానీ పార్టీలూ

చిన్నాఫీసరు దగ్గిర్నుండి జిల్లాఫీసరుదాకా
అందరికీ ఆయనిల్లు గెస్టుహౌస్
అవసరం వున్నాళ్ళపై అప్పల్రాజు చూయించే
అనురాగమూ ఆప్యాయతా అలాంటి దిలాంటిదా?
ఎవరి రుచులకు తగ్గట్టు వారికి అన్నీ ఎరేంజ్‌జేసే సాధన సంపత్తి
ఎవ్రెడీ బ్యాటరీలా ఎప్పుడూ రెడీగా వుంటుంది
పెట్రోలు గొట్టించి చేతికి రెండు పచ్చనోట్లిస్తే
పోస్టింగ్‌గానీ ఊస్టింగ్‌గానీ
అయిదు నిమిషాల్లో హైదరాబాదులో అటో ఇటో దేల్చేస్తాడు
రాజ్యాంగచట్టంలోని సెక్షన్ వన్ సబ్‌సెక్షన్ సీలో
క్లాజ్ జీ గూర్చి మాట్లాడితే
వినేవాళ్లు గిర్రున గింగిరాలు తిరగాల్సిందే!
రాజధానిలో అధికారపార్టీ రాజకీయం
ఊర్లోబహద్దరువాడికి దాసోహం జేస్తోన్నట్లు మాయనాటకం
ఎలక్షన్ పాలిటిక్స్‌లో అంతకు మించిన చెయ్యి జిల్లాలోనే పూజ్యం
ఇద్దరికీ పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేంత గృహకలహాలూ
లోకల్ పాలిటిక్సులో లుకలుకలున్నా
వొహరిపై ఇంకొహరు కారాలు మిరియాలు నూరి
మనస్సుల్లో కత్తులు దూసినా
హఠాత్తుగా మిన్ను విరిగి మీదబడితే
వొహరి కొహరు మహదివ్యంగా ఉపయోగపడతారు!
అప్పల్రాజు అప్పుడే ఫోంచేసి ఈజీ-ఛైర్‌లో వాలాడు
చిగుళ్ళలో ఇరుక్కున్న చాపముల్లు అగ్గిపుల్లబెట్టి కెలుకుతున్నాడు
"బాబుగారు బేగీ రమ్మన్నారు"
అంటూ వొచ్చాడు వొహ కారమీసాలరాయుడు



# 4. అరణ్యరోదనపర్వం

"నమస్కారం"- అప్పల్రాజు కూర్చున్నాడు
"ఏఁవి నమస్కారం ఏఁవి తిరస్కారం ?
మన ఎలక్షన్ ప్రచారం అరణ్యరోదనం
మనసేఁవీ బాగోటల్లా రాజూ
రోజురోజుకీ ఎక్కువవుతోంది సీటుమీద మోజు"
మొగుడు జావగా ముండమోసిన వెధవముండ పోజు
పెట్టి దేవుడో రావుడో అంటూ
దిగాలుపడి కూర్చున్నాడు బహద్దరు మారాజు
"మీరేం భయం పడొద్దు" అప్పల్రాజు ప్రారంభించాడు
"వ్యాపారం చెయ్యబోయేముందు
వ్యవహారం లోతుపాతుల్ని అర్థంజేసుకోవాలి
ఎన్నికల్లో నిలబడబోయేముందు
దాని సులిసూత్రాలు ఒంటబట్టించుకోవాలి
పల్లెపట్టుల్లోని రైతు కూలీల దగ్గిరకెళ్ళి
శిస్తులూ జప్తులూ పన్నులూ గూర్చి మొసలి కన్నీరు గార్చాలి
కూలోళ్ళ పేటల్లో కెళ్లి తిండీ బట్టా కూలిరేటూగూర్చి మాట్లాడాలి
బదాబదలైన బనీనుపై టెర్లినూ పాప్లినూ కప్పి

విగవిగలాడే బోగం రంగి వేషాల్తో
దారిద్ర్యాన్ని అందంగా అలంకరించే వైట్ కాలర్ వర్కర్లదగ్గిర
బేసిక్కూ డి. ఎ. హౌస్ ఎలవెన్సూ సోరింగ్ ప్రైజెస్
కాన్ఫిడెన్షియల్ ఫైల్సూ ప్రమోషన్లూ
ఖరాక్రసీగూర్చి గంభీరోపన్యాసం దంచాలి
అప్పుడప్పుడూ లార్డ్ శ్రీ వెంకటేశ్వరాగూర్చీ
పుట్టపర్తి సత్యశాయిబాబా మహత్తుగూర్చీ
సందర్భశుద్ధిగా మాత్ర వేస్తుండాలి
కమ్యూనిస్టు నియంతృత్వ అపాయంగూర్చీ
దేశానికి సైనిక నియంతృత్వ అవసరంగూర్చీ
అవతలవాణ్ణిబట్టి పొడివెయ్యాలి
ముసిలీ ముతకా దగ్గర పాపం పుణ్యం భక్తి రక్తి
ఆచారం అనాచారంగూర్చి మెట్టవేదాంతం దంచాలి
గుళ్ళూ గోపరాలమీదికి జనం దృష్టిని మళ్ళించి
వాటిని మరమ్మత్తు జేయిస్తామని ప్రామిస్సు జేస్తే
కూడూ గుడ్డా గూర్చిన ప్రస్తావన హాయిగా మర్చిపోతారు!
మిడిల్ క్లాస్‌వాళ్ళని ఇంద్రులూ చంద్రులూ
అంటూ లగాయించి పంప్‌గొట్టి
అంతా మీతోనే వుందని తెగ కోసెయ్యాలి
డెమోక్రసీ వెల్ ఫంక్షనింగ్‌కి దేశంలోని మిడిల్ క్లాస్
బ్యాలన్సింగ్ ఫాక్టర్ - బ్యాక్ బోన్-
దాని వునికి - మోస్ట్ ఇంపార్టెంట్-
అంటూ తెగ పొగిడెయ్యాలి
అల్పసంతోషులూ అల్పజీవులూ ఐన మిడిల్ క్లాస్‌వాళ్ళు
ఊరికే ఐసైపొయ్యే రకాలు!
తురకవాళ్ళదగ్గైతే మసీదులూ మక్కామదీనాలూ
ఖురానూ నైజాం నవాబూ పాకిస్థానూ మైనారిటీ హక్కులుగూర్చి
పందిరిమీద పచ్చిగడ్డి బైస్కేదాల్ భాషలో-
ఉద్రేకంగా లెక్చరుగొట్టాలి

ఆధునిక ప్రజాస్వామ్యమంటే
అందరినీ వొప్పించి మెప్పించే వెలయాలేగా !!
ఏమిందగాడికి వ్యతిరేకంగా ప్రవర్తించినా
పడుపుకత్తెకి పైసా రాల్దు
ఎన్నికలముందు ఎవరి మనస్సు చివుక్కుమనిపించినా
బ్యాలెట్ పెట్టెలో ఒక్క ఓటుగూడా పడదు!
ఈ సులిసూత్రాలు స్వేచ్ఛకీ, డెమోక్రసీకీ
మారుపేరైన అమెరికాలోనే అనుసరిస్తారు- మనం వో లెఖ్ఖా -మా!
ఇలా జెయ్యకపోతే ఇప్పుడనుకొనే
ఈ మూడు లకారాలు కాదు సరికదా
ఇట్టాంటి లక్షలు మరో పది బెట్టినా వొక్క వోటూ పడదు
కనీసం డిపాజిట్టూ దక్కదు!
డబ్బులకీ కోతలకీ నంగనాచి నీతులకీ
అమ్ముడువోయే వీళ్ళు వేంవా గొర్రెలమందా!
అర్ధశేరు బియ్యానికీ ఐదురూపాయల నోటుకీ
వజ్రాయుధంలాంటి ఓట్ను అమ్మే యీ దిక్కులేవి కుక్కలకి
ఎవడిచ్చాడో ఎందుకిచ్చాడో ఈ హక్కు!"

నవసముద్ర జలపాతంలా సాగిన బావయ్య ఉపన్యాసానికి
బహద్దరు ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు!
"రాజూ వొత్తి గజాపెంకువే అనుకున్నా
పాదరసంలాంటి ప్రతిభాశాలివి
చంద్రగుప్తుడికి చాణక్యుడిలా
బ్రిటిష్వాళ్ళకి సర్ విన్స్టన్ చర్చిల్లా
కురుక్షేత్రంలో అర్జునుడికి శ్రీకృష్ణపరమాత్మలా నాకు నువ్వే దిక్కు!
గోల్కొండ నవాబులకి దివాన్గిరీ జెయ్యవలసినంతటాడవు
స్టార్ వక్రించి రాహూ బాగోక ఈ దౌర్భాగ్య దేశంలో పుట్టావు
నీ మీద నాకు నమ్మకం కుదిరింది
ఈ పాశాన గంగలో దూకమంటే ఇట్టాగే దూకేస్తా

నువ్వు తప్ప మరో దిక్కు లేదు!"
లేచొచ్చి అమాంతం రెండు చేతులూ పట్టుకొన్నాడు!
గొంతెత్తి బావురుమని ఏడ్చాడు!!
"అరెరె అంతపనా? అపచారం! అపచారం!!
మీ ఉప్పు తిని ఇంతవాడినయ్యాను
మబ్బాయి అమెరికా వెళ్ళడానికి మీరు కాదా కారణం??
ఈ రోజుల్లో సినీస్టార్‌కున్న వేల్యూ
కొమ్ములు దిరిగిన పొలిటికల్ లీడర్లకి సైతం శూన్యం
రాను రాను జనానికి బాబాలపై మోజు బలుస్తోంది అధికం
వాహ యాక్టర్నీ మరో బాబాగార్నీ
ఈ వేళే ఫోన్‌లో కాంటాక్ట్ చేద్దాం"



# 5. ఎన్నికల ప్రచార పర్వం

తెలుగు సినిమాని కోడంబాకంనుండి అమాంతం లేపుకొచ్చి
ఛార్మీనార్ పక్కన పాతేసేందుకు నడుం కట్టి
ఉడుంపట్టుబట్టిన అగ్రశ్రేణి హీరోగారు
ఎన్నికల ప్రచారం కోసం
ఉపన్యాసం దంచేందుకు విచ్చేశారు।
రైల్వేస్టేషనూ ట్రావెలర్స్ బంగళా
రోడ్లనిండా ఇసకేస్తే రాలనంత జనం।
బిందెలతో నీరు వారపోస్తూ మంగళ హారతులిచ్చి
దేవుడిలా పూజిస్తోన్న మహిళామణులూ
పోలీసు లాఠీఛార్జి సైతం ఖాతరు జెయ్యకండా
చిత్తకార్తె కుక్కల్లా వెంబడపురికే కాలేజీ విద్యార్థులూ।
ఎద్దైన గేదెల్లా యాక్టరు కారువెంట లగెత్తే
భావిభారత పౌరులైన యువక కిశోరాలూ।
అయ్యో రామచంద్రా। నేడు సినీతారదుకున్న పాపులారిటీ
రాజకీయ నాయకుడికిగూడా లేదే?।
ప్రజాతంత్రమూ జనత చైతన్యమూ
దిగ్విజయ తిరోగమనం సాగిస్తోన్నాయా?

• • • •

ఆలిండియా మహిళామండలి లీడరు
ప్లానింగ్ కమిటీలో కో-ఆప్టెడ్ మెంబరు
అనాధ యువతీ శరణాలయం బోర్డు ట్రస్టీ
మిడిల్‌క్లాస్ వార్డుల్లోని మహిళామణుల్ని కలుసుకొని
బహద్దరువారి ప్రజాసేవా తత్పరతనీ వితరణ శీలాన్నీ
వేనోళ్లా విశదీకరించి వొప్పించి మెప్పించేందుకి
ఎన్నికల సంగ్రామ రంగంలో ఏక్దం దూకింది।

సిగలో పూలూ చేతిలో బ్యాగూ
ఓహో ఏం వాసన కమ్మకమ్మగా।
చేతికి వాచీ కాళ్ళకి కళ్ళకి జోడు
వెంటేసుకొచ్చింది ఎవరినో తోడు।
నయగారం వొలకబోస్తూ ఎన్నికల ప్రచారానికా?
కాక- అభిసారికా వేషంలో భేషైన శృంగారానికా?।
మహిళా లీడరుగారి అపూర్వ వాగ్ధాటికి
ప్రమాదవనాల రీడర్సూ, రీడర్స్ డైజెస్ట్, భవాన్స్ జర్నల్ కస్టమర్సూ
కళ్లు అప్పగించి నోళ్లు అప్పళించేశారు।
ఇంటింటికీ తిరిగి బొట్టూ కాటికా పెట్టింది
గడపలకి పసుపురాసి తాంబూలం ఇచ్చింది
మరికొంతందు ఘుమాయిస్తోన్న గంధం గొంతుకి పూసింది
కరపత్రాలు పెద్దాళ్ళకీ కాయితం జెండాలు చిన్నాళ్ళకీ పంచింది
తప్పక ఓట్ చెయ్యాలి సుమా- అంటో
చేతిలో చెయ్యివేయించుక థాంక్స్ చెప్పి చక్కా వెళ్ళిపోయింది।।

* * * *

సినీ తారదూ మహిళా లీడరూ
పోయిన వారానికల్లా పూజ్య బాబాగారు దిగారు।
చీలమండలదాకా జీరాడుతోన్న శాటిన్ సిల్కు లాల్చీ
లోపల కంచిపట్టు సుతిమెత్తని లంగోటి
జటా జూటాలు తెగ పెరిగిన శిరం

జర్మన్ లిల్లిపుట్ నైఫ్‌తో నున్నంగా గీసిన గెడ్డం
అడ్డంగా మూడు రేఖలూ నొసటమీద గంధం
అచ్చం బ్రహ్మ వర్చస్సుతో వీరభోగ వసంతరాయల తేజం ॥
బాబాగారు సాక్షాతూ కలియుగ రసికేశ్వరావతారం ॥।
ఓ డజన్ చక్రకేళీయా అరడజన్ నారికేళాల నీళ్లూ
బాబాగారికి రాత్రింబగళ్ళూ పరిచర్యజేసే
కన్నెపిల్లల్లాంటి కాశ్మీర్ యాపిల్ పళ్లూ ॥
స్వర్ణపాత్రలో బాదంపాలూ అప్పుడప్పుడూ కోళ్లూ
భోంచేస్తాయి- పూజ్య బాబాజీ అన్నం సుతరామూ ముట్టరు।

బాబాగారు పద్మాసనంవేసి వేదికపై ఆసీనులయ్యారు
సిటీ పోలీసులూ వానప్రస్థాశ్రమంలో ప్రవేశించిన ముసిలాళ్లూ
చెక్కభజనజేస్తూ బాబా మహాత్మ్యాలు కథల్లా చెప్పుకొంటున్నారు
పక్కా వాయస్సులోవున్న సీతాకోకచిలకలవేపు
అచ్చమైన అస్ఖలిత బ్రహ్మచారులంగారు
స్వచ్ఛమైన దృష్టి సిగిడ్చి తీవ్రంగా తిలకిస్తున్నారు ॥
ఆదివారం గాబట్టి బాబాగారు మౌనవ్రతం దాల్చారు

టేబుల్‌కింద చేతులుబెట్టి లకారాలు గడించిన నిజాయితీపరులు
మతపిచ్చ నసాళాని కెక్కిన బాబావారి పి. ఏ. వారు
పూర్వాశ్రమంలో రిటైర్డు డిప్యూటీ కలెక్టరుగారు
పరమపూజ్య బాబాజీ ఉపన్యాసామృత సారాన్ని
సర్వులకీ పంపిణీజేసేందుకు ప్రారంభించారు।

"భక్తాగ్రేసరులారా"—
"ఏవిటా హరికథ?" ఎక్కడినించో కేక।
"మతాతీత రాజ్యాంగం పేరిట
మతధర్మం భ్రష్టమై పాపం పెరిగిపోతోంది।
పరమ పవిత్రమైన వైదిక ధర్మ దిగ్విజయార్థం
పన్నెండొందలమైళ్ళ దూరాన్నయినా ఖాతరు చేయకుండా
బాబాగారు వొచ్చారీ నగరానికి ఎన్నికల ప్రచారార్థం

శ్రీకృష్ణ పరమాత్మ పరమ పవిత్రమైన భగవద్గీతలో
దైవాసుర సంపద్విభాగ యోగంలో ఏమని సెలవిచ్చారూ!"
కంఠం సవర దీసుకున్నారు—
"కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః
మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తన్తే శుచివ్రతాః"
"ఆశాపాశ శతైర్ బద్ధాః కామక్రోధ పరాయణాః
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థ సంచయాన్."
"ఆత్మ సంభావితాః స్తబ్ధాధనమాన మదాన్వితాః
యజన్తే నామ యజ్ఞైస్తేదంభేనా విధిపూర్వకం"— అంటే ....
తీరని కోరికలు పెట్టుకొని కపటం అహంభావం గర్వం నిండగా
మూర్ఖంచే దుర్మార్గ భావాలతో నీచులై ప్రవర్తిస్తారు;
వేలకొలది ఆశాపాశాలచే బంధించబడిన
ఈ కామక్రోధ పరాయణులు
కామ భోగార్థం అన్యాయ మార్గంచే
ధనరాసుల్ని ఆర్జించ కోరుతారు;
ఆత్మస్తుతి శీలురై వినయశూన్యులైన ఈ ధనగర్వమదాంధులు
విధ్యుక్తధర్మాన్ని ఉల్లంఘించి కపటవర్తనులై జీవిస్తారు"—
"హియర్ హియర్ .... వన్స్ మోర్"— కేకలు!
ఆకాశం బద్దలయ్యే చప్పట్లు ఈలలు కేరింతలు!
"బావా అప్పలరాజా యెవర్నిగూర్చి యీయన ఉపన్యాసం యిస్తున్నాడు?
చెవులు నిక్కబొడుచుకొని వింటున్న అప్పలరాజా కిమిన్నాస్తి!!
"తిండీ బట్టా ఇల్లూ వాకిలీ
పెళ్ళాం పిల్లలంటూ కోరికలు బలిసిపోయాయి
దుర్మార్గమైన దైవద్రోహశక్తులు దేశంలో విజృంభిస్తోన్నాయి
కాబట్టీ—
"యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయో భూతిర్ ధ్రువా నీతిర్ మతిర్మమ"— అంటే ....

అఖండ మేధాశాలీ
అపర శ్రీకృష్ణ భగవానుల్లాంటి అప్పల్రాజుగారూ
అభినవ అర్జునుడిలాంటి బహద్దరువారూ ఎక్కడుంటె అక్కడ
సంపదా విజయమూ అభ్యుదయమూ రాజనీతీ వుంటాయి
అంచేత భగవద్భక్తులూ
వైదిక ధర్మ నిరతులూ ప్రజాసేవా తత్పరులూ
అయిన బహద్దరువారికే
మీ పవిత్రమైన ఓటు వెయ్యగలందులకు ప్రార్థితులు "
అమృతం పంపకం పూర్తయ్యేప్పటికి
బాబాగారూ వారి పి. ఏ. వారూ భక్తజనులే మిగిలారు।

"ప్రజలకి ఇహలోక చింత యెక్కువై ధర్మచింత క్షీణిస్తోంది"
బహద్దరువారు బాబాగార్ని చెయ్యిపట్టుకొని
రోల్స్‌రాయిస్ కారులో ఎక్కిస్తుండగా
పూజ్య బాబాగారు సెలవిచ్చారు।
శ్రీవారు దీనంగా కళ్ళప్పగించి నోరప్పళించి చూశారు।।



# 6. విశ్వరూప సందర్శనపర్వం

"బావా అప్పుల్రాజూ
ఎక్కడికెళ్ళినా చుక్కెదురవుతోంది ఏంటీ జెయ్యడం?"
విషాదయోగం పోజుబెట్టి బహద్దరు ప్రశ్నించారు!
"జట్కావాలా పార్టీవాళ్ళతో వేగలేక చస్తున్నాం
ఈ రోజు ప్రచారానికి కాలవగట్టుకేసి వెళ్దాం"
బావగారితో బహద్దరు బయల్దేరారు
మందీ మార్బలమూ హంగూ అడావిడితో కాలవగట్టుమీద దిగారు
కుళ్ళి కుక్కచచ్చిన కంపుగొడుతోన్న
పెట్టుబడిదారీ సమాజ శరీరంమీద
చీవూ నెత్తురూ కారుతూ
కులకులలాడే పురుగులు నిండిన కురుపుల్లాంటి పందుల గూడేలు!
పావలాకి పది నిమిషాల సుఖాన్ని అమ్మి
పెంటల్లో క్రిముల్లాంటి బతుకు గడుపుతూన్న మూగజీవాల్ని
శ్రీమాన్ బహద్దరువారు ఓట్లు అడిగారు
ఇంటికి శేరు బియ్యవూ మనిషికి రూపాయినోటూ వాగ్దానం జేశారు
అట్టాగేనంటూ నోరూవాయీ లేని గొర్రెలు
డూ డూ బసవన్నల్లా తలలూపారు.

గుడిసె గుడిసెకీ జెండాలు వెలిశాయి।
గూడెం గోడలన్నీ శ్రీవారి పేరుతో నిండాయి।
రోజురోజుకీ ఎన్నికల ప్రచారం మహజోరుగా కారుగా సాగింది
బహద్దరువారి గుండెల్లో కార్లూ రైళ్లూ పరుగెత్తాయి।
వొంటిమీద తేళ్ళూ జెర్రులూ పాకాయి।।
నియోజకవర్గమంతా ఇష్టంగానూ దౌర్జన్యంతోనూ
జెండాలు అలంకరించుకొంది
రౌడీలూ గూండాలతో ఊరూనాడూ దద్దరిల్లిపోయింది
అప్పటికే మూడు లకారాలనుకున్న అంచనా
అమాంతం ఆరుకి దేకింది।
పదవి దక్కకపోతే ఫింగుబాయె
కనీసం పరువైనా దక్కుతుందో లేదో నన్నే చీకు
మనస్సును చీకాకు పెడుతోంటే చింతాక్రాంత చిత్తుండై
ఆపద్బాంధవుండూ అనాధ రక్షకుండైన
అప్పలరాజు భగవానుల్ని పిలిపించాడు బహద్దరువారు।
తెల్లవారితే పోలింగు – సర్వులూ సమావేశమయ్యారు.

* * * *

గదాచక్ర కిరీట ధారియై
అభినవ శ్రీకృష్ణ పరమాత్మలాంటి అప్పలరాజు ప్రవేశించాడు
"నా ప్రియమైన బావా। (దేవదేవా।)
నా మనస్సు భయ వ్యాకులితమై వుంది
తెల్లవారితే కురుక్షేత్ర సంగ్రామం ప్రారంభం
కీడు మూడు సూచనలు సర్వత్రా గోచరం– కిం కర్తవ్యం?

మహోద్దండ గండభేరుండ చండప్రచండ వదనంతో
అగ్నిలాంటి నాలికను ఆడిస్తూ
చింతనిప్పుల్లా మండుతూన్న కళ్ళని మూస్తూ తెరుస్తూ
మధ్య మధ్య పళ్ళు కొరుకుతూ పికికిలి బిగిస్తూ
లక్షోప లక్షల రూపాలుగా విస్తరిల్లిన
అవినీతి బంధుప్రీతి ఆశ్రిత పక్షపాతం

లంచగొండితనం రండాగొండితనం నిరంకుశత్వం శిరస్సులతో
వస్తువులు సమ్మెలు సత్యాగ్రహాలు మహోగ్ర ఉద్యమాలు
కోటానుకోట్ల నిష్టదరిద్రుల ఆకలిమంటల హాహాకారాల్ని
ఘాతుకంగా పరమ కిరాతకంగా
కాలరాస్తోన్న శతసహస్ర పాదాలతో
అపర కృష్ణావతారమైన అప్పల్రాజు విశ్వరూపం ధరించాడు
మహోగ్ర కంఠస్వరంతో
ఎలక్షన్ భగవద్గీతా ప్రబోధం ప్రారంభించాడు-

"హిమాలయాలనుండి కన్యాకుమారివరకూ
ఆసేతు శీతాచల పర్యంతం
నా విశ్వరూపమే పరిపరివిధాలుగా జ్ఞాతంగా లీలగా
విభిన్న సమయాల్లో వివిధ వ్యక్తులకి ప్రత్యక్ష మవుతుంటుంది
పాషండ నిరంకుశ అరాచక దేశద్రోహకర శక్తుల
ప్రళయభీకర ఝంఝామారుతం దారుణంగా దేశంలో వీస్తోంది
దక్షిణదిక్కున వాహసారి ఘోరంగా విజృంభించింది
సర్వమత సనాతన శక్తుల వత్తాసుతో
సమస్త కుబేరుల అకుంఠిత సంపత్తితో
దిగంత పరివ్యాప్తమై అనంత శక్తివంతమై అపరిమేయమై
అవినాశమైన నిరంకుశాధికార అంకుశంతో
ఆ శక్తుల పీచ మణచేందుకు
రక్షకభట వర్గమూ రాజ్యాంగచట్టమూ సర్వసన్నద్ధంగానే వున్నాయి
లక్ష్మీ పుత్రుల మిత్రరాజ్యాలు
సంపూర్ణ సహాయ సహకారా లందజేస్తాయి
"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన"
"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచం"

✓కర్మచేయడానికి మాత్రమే అధికారం వుంది। ఫలానికి లేదు।।
సర్వధర్మాలనూ విడనాడి నన్నొక్కణ్ణే ఆశ్రయించు
అన్ని పాపాలనుండీ నిన్ను నేను
విముక్తి చేస్తాననికదా గీతా ప్రబోధం?" — ✓
"బావా (దేవదేవా!) నీ విశ్వరూప సందర్శనంచేసి
అపరిమితంగా ఆనందించా
గదా చక్ర కిరీటాల్లాంటి
చేతికర్రా చుట్టపీకా తెల్లటోపీల్ని మళ్ళీ ధరించు!"
"మనోవైక్లబ్యం పొందక ధైర్యంగా వుండండి
ఎలక్షన్ జయలక్ష్మి తప్పక వరించు
ఊరూనాడూలోని అందరు హంగుదార్లనీ
కరేపాకూ నాగులూ గోపీ పిచ్చోడూ యిత్యాది
అనేకానేకులైన ఆప్తమిత్రుల్ని
అన్నిచోట్లా పకడ్బందీగా కాపలా పెట్టండి
గుడిసెకి శేరు బియ్యంవూ మనిషికి రూపాయి నోటిచ్చి
గొడ్లసావిట్లో మూకుమ్మడిగా తొయ్యండి
✓ఊరికి వదేసి ఏటపోతులూ
గూడేనికి పన్నెండేసి పందులూ చొప్పున పందేరం చెయ్యండి
వందల కావిళ్ళ కల్లూ పీపాలనిండా సారా దీసుకొచ్చి
ముడ్డీ నోటా పొయ్యండి ✓
తెల్లారుజామునే పోలింగ్‌స్టేషన్‌దగ్గిర మాలామందిని నిలబెట్టి
క్యూలో మధ్య మధ్య మనవాళ్ళని బెట్టండి
ఓటు వేయడాని కెళ్ళేముందు భాగోతం బైబిలూ ఖురాన్నూ
నెత్తిమీదబెట్టి ప్రమాణం జేయించి మరీ వొదిలెయ్యండి।।
అప్పుడప్పుడూ నోటు బాకీలూ కౌలు బకాయీలూ
కూతురు పెళ్ళి, కొడుకు ఉద్యోగమూ జ్ఞాపకం చెయ్యండి
ఈ సులిసూత్రాల్ని మీ రమలుజేస్తే

బహద్దరుగార్ని జయలక్ష్మి వరించి ఆయన మంత్రయ్యి
ఇంతకి మూడింతలు సంపాయించకపోతే నా మీసాలు తీసెయ్యండి"

"శహబ్బాష్ బావా ఎంతటి ధీశాలివి మేధాశాలివి !?
ప్రపంచాన్ని గజగజ లాడించిన హిట్లరంతటాడివి"

"అందరికీ నచ్చిన ఊసరవెల్లి వేషాలు వెయ్యటం
ఏ యెండ కా గొడుగుబట్టి మన పబ్బం గడుపుకు దొబ్బటం—
ఆధునిక ప్రజాస్వామ్యమంటే పొద్దుతిరుగుడుపువ్వు
ఆధునిక ప్రజాస్వామ్యమంటే సానిదాని నవ్వు
ఆధునిక ప్రజాస్వామ్యం వొక ప్రాస్టిట్యూటు
ఓటు దాని గేటుకి చెల్లించే రేటు-
తమలాంటి ఒక్కొక్క కుబేరుడు
వొహ ఇరవైమంది పార్లమెంటు
సభ్యుల్ని గుప్పెట్లో పెట్టుకొంటే
అవసరమైన డబ్బు సంచులు వెచ్చించే
అట్లాంటివాళ్లు మరో ఇరవైమంది వుంటే
పార్లమెంటునీ గవర్నమెంటునీ
మన చేతిలోని ఇన్స్ట్రుమెంట్గా మార్చడం ఏమంత కష్టం???
అమెరికాలో బిజినెస్ ఎడ్మినిస్ట్రేషనూ
పొలిటిక్సూ చదివొచ్చిన మా పెద్దాడు
నేటి డెమొక్రసీలోని నాటకం బ్యాలట్ బాక్స్ బూటకం
అమెరికన్ సెనేట్ మెజారిటీలోని అంతరార్థం
అరిటి పండొలిచిపెట్టినట్లు అంతా
అర్థమయ్యేట్లు యిచ్చా డుపన్యాసం!
నేటి ప్రజాస్వామ్యంలో ఓటుగాదు
సీటుగాదు డబ్బుమూట ప్రధానం!
అదే అంతిమ గమ్యం! అందరికీ పరమాదర్శం!!!

* * * *

రాతిరి జాతరలో ఖుషీగా పొద్దుపుచ్చేందుకు
రాత్రికి రాత్రే వూళ్ళల్లోని అలగా జనాన్ని
లారీల్లో కుక్కి పత్తాలేకండా మాయంజేశారు !
రైసుమిల్లుల్లో గొడ్లసావిళ్ళలో వాళ్ళు
ఎలక్ట్రిను చుట్టూ తిరిగే ప్రోటానుల్లా
సారాపీపా చుట్టూ మూగారు
మట్టి మూకుళ్ళలో గొడ్డు మాంసం వొడ్డించారు
వొళ్ళూ పై తెలీకండా వాళ్ళు తాగి తందనాలాడారు
కొత్త ఖద్దరు గోత్రీకుల పుణ్యావా అంటో
ఎన్నడో చచ్చిన రంకు డాన్సులు
జనానికి రాత్రంతా చైతన్యం పంపిణీ జేశాయ్ !
బహద్దరు ఎరేంజ్ జేసిన సెక్సు బ్రెడ్డూ సారా వాటరూ
జనాన్ని ముడ్డీ నోటా ముంచెత్తాయ్ ! ! !



# 7. స్వర్గారోహణపర్వం

తాలూకాఫీసులో కౌంటింగు ప్రారంభమైంది
బ్యాలట్ పెట్టెల్లో ఓట్లు తిరగేసి మరగేసి
కిందా మీదా జేసి లెక్కబెట్టారు
ధనం రాహువు ప్రజా సూర్యుణ్ణి మింగేసింది
పైసా గెలిచి ప్రజల తీర్పు గోల్‌మాలైంది।
అపూర్వ త్యాగాలు చేసి అష్టకష్టాలకి లోనై
దారుణ దౌర్జన్యాన్ని సైతం ఖాతరు జేయకుండా వోట్ చేసినవారు
తల్లి చచ్చిన దిగులుతో తలొంచుకొని
గుడ్లల్లో నీళ్ళు కుక్కుకుంటూ కామ్‌గా వెళ్ళిపోయారు
పరమపద సోపానపటం పాము నోట్లో
కటిక్కన పడవలసిన బహద్దరు లటిక్కన తప్పించుకొని
తొంభయిమూడు వోట్ల థంపింగ్ మెజారిటీతో
అఖండ దిగ్విజయాన్ని సాధించాడు।
అపూర్వ విజయమంటూ తాటికాయంత అక్షరాలతో
పతాక శీర్షికలిచ్చి ప్రచురించి చంక లెగురవేశాయ్ వారపత్రికలు
కాడిగట్టిన జోడెద్దులమీదనే బహద్దరు దేశమంతా వూరేగాడు
ఆకాశం దద్దరిల్లేట్లు లారీల్లో ఎక్కిన కిరాయి సరుకు
గొంతులు చించుకొని అడిలింది
హరిజనవాడల్లోని కొంపలకి అమాంతం నిప్పంటుకొంది

విందులూ గోవిందులూ ఖుషీగా జరిగిపోయాయి
పంది మాంసాలకనీ పందేరాలకనీ
పొలిటికల్ బ్రోకర్లూ హైక్లాస్ డాఫర్లూ
ఎవళ్ళకి చిక్కినంత వాళ్ళు రెండుచేతులా పట్టేశారు
సిమెంట్ కోటాలూ ఐరన్ పర్మిట్లూ గవర్నమెంట్ కాంట్రాక్టులూ
బస్ రూట్లూ అమోనియా లారీలతో
బహద్దరు ఏడాది తిరక్క పూర్వమే
పెట్టిన ఖర్చుకి మూడింతలు గడించి పూరాగా పండిపోయ్యాడు !
అప్పుల్రాజు బావ నాలుగు సినిమా హాళ్లూ
రాజధానిలో రెండు హోటళ్లూ
రాజకీయ బాధితుడి పేరుతో
పదిహేను ఎకరాల పాటిదిబ్బా గడించాడు
సంతకం కావాలన్నా మొరబెట్టుకొందామన్నా
బహద్దరు ప్రజా సేవకుడు పత్తాలేకండా మాయమయ్యాడు !
ప్రజాబలంతోగాక పైసా ఆసరాతో గెల్చి
పదవీ స్వర్గారోహణ జేసిన "ప్రజాసేవకుడికి"
ప్రజ లెందుకూ... వారి మొరలెందుకూ ?!



# 8. మహాప్రస్థాన పర్వం

తల ముగ్గుబుట్టలా మారినా
దోవవెంబడి నడిచే వొయస్సు మగాళ్ళని జూసి
అసందర్భంగా గాజులు గలగలలాడిస్తో
వెకిలిగా నవ్వే ముసిల్దాని నవ్వులా
అరవయ్యోపడిలో పడ్డా అభిసారికల్ని పఠించే
కరణం వెంకట్రామయ్యలా
ప్రాతఃకాలాన మడిస్నానం జేసి తడిబట్ట గట్టి
అర్ధ దిగంబర వేషంలో తిరగేసిన కీలర్‌లా
చూపరుల్ని రెచ్చగొడుతూన్న ఆధునిక యువతి ఆచారంలా
డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతంపై థీసిస్ రాసి
డాక్టరేట్ గడించిన సైన్సు యమ్ యస్సీ
ఊళ్లో కలరా వొస్తే యింట్లో పోలేరమ్మకి
సద్ది నైవేద్యం బెట్టమని పెళ్ళాన్ని సతాయిస్తున్నట్లుగా
అల్పాజమానానికి పోయేముందు రోడ్డుపక్కన
మట్టిబెడ్డలూ యిటిక ముక్కల కోసం
ఆత్రంగా అన్వేషించే సూటేసిన తురక ప్లీడరుగారిలా
పెళ్లానికి టైఫాయిడ్ వొస్తే
ఏసుప్రభువును ప్రార్థించే పీటరు ప్రభాకరంలా
సినిమాలో సీతమ్మోరి చెరలు జూసి
తెగ యేడ్చేసి ముక్కు రక్కేసుకొని

సందెచీకటి పడగానే రంకుపయ్యాటలాడే సంసారిలా
దేశంలో ఎవరు ఏది ఎందుకు చేస్తోన్నారో చెపుతోన్నారో
మరొకళ్ళకి అంతుబట్టని సాంస్కృతిక సంక్షోభం దాపరించింది।
కాలం చెల్లిన ఆచారానికి నేటి కృత్రిమ యాంత్రిక జీవన విధానానికి
సంఘర్షణ దారుణంగా జరుగుతోంది
పూర్వపు పాపపుణ్యాలస్థానే ఆధునిక నీతిసూత్రాలు అవతరించే
సంధికాలంలో సంఘం తొక్కిసలాడుతోంది
జీవితమూ ఆలోచనా విధానమూ ఆచరణా
ఇంటింటి పజ్జ్యాల గేయకవి అంత్యప్రాస విలాపంలా
అత్యంత జుగుప్సాకరంగా
దొంగముఖంలా తుమ్మల్లో పొద్దుగూకినట్టుగా
ఎవరికీ అర్థంగాకుండా వుంది
చచ్చిన ఆచారం శవంమీద అందమైన దుస్తుల్ని కప్పేందుకూ
హేయమైన దారిద్ర్యాన్ని తెచ్చిపెట్టుకొన్న వేషభాషల్తో
దాచేందుకూ అంతా ప్రయత్నిస్తున్నారు
అవిద్య అజ్ఞానం ఆకలీ జనత బతుకుల్ని నిరాఘాటంగా పాలిస్తోంది
మూఢ మత విశ్వాసం ప్రజల మనస్సుల్నీ చేతల్నీ అనుశాసిస్తోంది
జీవిత గాంభీర్యమూ నైతిక విలువలూ
హేతుబద్ధ చింతనా మంటగలిసిపోయాయి
నేటి సొసైటి విశాఖపట్నం ల్యూనటిక్ ఎసైలంలా తయారైంది।

అమూల్యమైన ఓటును
అయిదురూపాయల నోటుతో కొనేసే దేశంలో
రౌడీలూ రాజకీయ దళారీలూ ఎలక్షన్ ప్రాపగాండాలో
ప్రముఖ పాత్ర వహించే రాజ్యంలో
ప్రజాతంత్రం స్థానంలో పైసాతంత్రం
చైతన్యం స్థానంలో సారాయితనం
యూనిటీకి బదులు ముఠా తగులాటం
మనిషికి బదులు ధనం కులం అంగూ ఆర్భాటం
వివేకానికి బదులు పచ్చి గూండాయిజం
పిచ్చిగా పెచ్చరిల్లిపోతోంది
ఉషశ్రిపఠిల్లా బెల్ట్రింటర్ప్ అనువాదాల్లో తలదూర్చి
తిమ్మిని బమ్మినీ బమ్మిని తిమ్మినీ చేసే రచయితలు

తమ పవిత్ర విధ్యు క్త ధర్మాన్ని విస్మరించి
ఎల్లో జర్నలిజానికి మా భేషుగ్గా అంకితమైపోయి
గొలుసు పత్రికల జీతబత్తేలకి అమ్ముడై పోతోన్నారు ।
మూలబడ్డ దేవుళ్ళ గుళ్ళ పీఠాధిపతుల
దివ్యచరిత్రలూ క్షేత్రమహత్యాలూ ప్రకటిస్తో
పీడకవర్గ హేయమైన ప్రయోజనాల్ని నిస్సిగ్గుగా సమర్థిస్తో
చెరకు పిప్పికంటే మూడింతలు తక్కువైన
పరాన్న భుక్కుల్ని కీర్తిస్తో
వారఫలాలూ జన్మదిన ఫలాలూ
గోచార ఫలితాలూ గోంగూర పచ్చళ్లూ గూర్చి రాస్తో
భక్తినీ ముముక్షుకత్వాన్నీ
తులం పదమూడు నయాపైసాల చొప్పున
ప్రతి ఆదివారం ప్రజలకి పంపిణీ జేస్తో
పాలకవర్గానికి ఫస్ట్‌క్లాస్ బాకాలుగా తయారైన
గొలుసు పత్రికలూ వాటి వారపత్రికలూ
బాలయోగిగారి మఠం తలుపులు
వాటికవే లటిక్కన తెరుచుకున్నాయనీ
పూర్వజన్మాన్నిగూర్చి పూరాగా జెపుతున్నాడనీ
చంకలో ఊసరవెల్లి పుట్టిందనీ
నానా కల్లబొల్లి కథల నల్లమందుతో
ప్రజల్నీ పబ్లిక్ వొపీనియన్నీ
మహ బాగా మలుస్తున్నాయి ।
నానారకాల సంక్షోభంతో సతమతమవుతూ
అడ్డపీత నడక నడుస్తూన్న ప్రణాళికలూ
బందరు ఉప్పెనలా మునుముందుకు చొచ్చుకువొస్తూ
గోదావరి వరదల్లా దేశాన్ని ముంచెత్తుతూ

జాతి మూలుగుల్ని నిలువునా పీల్చేస్తోన్న విదేశీ పెట్టుబళ్లూ
ఊర గంగానమ్మ నోరుబెట్టుకొని
గాల్లో పందికొక్కుల్లా దేశం గ దెలో దూరి
రాజభరణాల రూపంలో జాతి కొంపంతా
కుంపుజేస్తోన్న మ జీ రాజులూ తరాజులూ
రాత్రింబగళ్ళూ కష్టించి సృష్టిస్తోన్న జాతి నిస్తుల సంపదల్ని
అడ్డంగా మేసేసే రాజకీయ సంబంధులైన బడా బడా కంట్రాక్టర్లూ
పెరుగుతోన్న నిరుద్యోగమూ ధరలూ
తరుగుతోన్న జీవన ప్రమాణాలూ
చంద్రమండలాన్ని ముద్దెట్టుకోవడానికి
పై పైకి యెగబాకే రాకెట్ లాంటి పన్నులూ
దినగండం నూరేళ్ళ ఆయుష్షులా
కరువు బతుకుల్ని బరువుగా యీడ్చే కోట్లాది ప్రజలూ
ఆకాశ పంచాంగంలాంటి అంకెల గారడీతో
మానవమాత్రుడికి అంతుబట్టని లాటిన్ గ్రీకు భాషల్లో
అభివృద్ధిని అభివర్ణించే పాలకవర్గం
భిక్షాందేహి అన్నపూర్ణేశ్వరీ ... తా అంటూ
అక్షయపాత్ర పుచ్చుకొని అడుక్కుతింటానికి
ప్రపంచ గుత్త పెట్టుబడిదార్ల స్వర్గధామానికి బయలుదేరిపోతాం ::
స్వయంపోషకత్వానికి బదులు ముష్టెత్తడం
ఎక్సెప్షన్‌గాక జనరల్ రూలైంది!
స్వరాజ్యలక్ష్మి కాపరాని కెళ్ళి పదిహేడు సంవత్సరాలు నిండినా
నేటికీ భూసంస్కరణల శిశువును కనదు
మా సికమ్మో ఏంపాదో ??

మహోత్కృష్ట మానవతా సిద్ధాంతంకోసం
కోట్లాది నిష్దరిద్రుల బతుకుల్లో
అపూర్వ వసంతాలు విరబూయించేందుకోసం
భూమికై భుక్తికై మానవ విముక్తికై
అనేకానేక వీరోచిత పోరాటాల్లో ఆహుతవుతూ
జైళ్ళనీ తుపాకి గుళ్ళనీ ఘోర హింసల్నీ నరకయాతనల్నీ
తమకై తామే వరించి శిలువమీది జీసస్‌లా బలిఅవుతూ
జాతీయ స్వాతంత్ర్య గౌరవ ప్రతిష్ఠల్ని

అడుగడుగునా పరిరక్షించే
వజ్రాల్లాంటి నేలతల్లి ఉత్తమోత్తమ పుత్రులు
దేశద్రోహులుగా పరిగణింపబడుతూంటే—

నానా కుంభకోణాల్లో సిగ్గుమాలిన లాలూచీల్లో అప్రతిష్టపాలై
ధనం మూటల బూట్లు నిస్సంకోచంగా మోసే
విదేశీ స్వదేశీ కుబేరుల తాబేదార్లూ
బ్రిటిష్ సామ్రాజ్యవాదుల గత కాలపు బంట్లూ
సబ్బుల కంపెనీల ఏజంట్లూ
దేశభక్తులుగా చలామణీ అవుతూంటే
దేశం తనను జూచి తానే
తనలో వెర్రిగా నవ్వుకుంటోంది॥

దశాబ్దన్నరపాటు యెదురులేని గుత్తాధికారం చెలాయించి
విదేశీ స్వదేశీ గుత్తపెట్టుబళ్ళతో ముద్దుముద్దుగా చెలిమిజేసి
జనాన్ని శోషిల్లే దశకి తెచ్చిన పాలకవర్గం
నేడు సోషలిజాన్ని జపించడం ప్రారంభించింది।
భారతజాతీయ జీవితరంగంపై
దారుణ భీషణమైన నాటకం
ప్రశాంత గంభీరంగా ఆడఃడుతోంది
ప్రళయ భీకరమైన ప్రజల అసంతృప్తి లావా
జాతి హృదయం అగ్నిపర్వతంలో
నివురుగప్పిన నిప్పులా నానాటికీ రాజుకొంటోంది
ఏ రూపంలో ఏనాడు ఈనాడులో
ఆ అగ్నిపర్వతం బ్రద్దలవుతుందో ఎవరికి తెలుసు॥

దేశాన్ని అమావాస్య ఆవహించింది
అధికారం అవినీతికి దోవతీసింది
హద్దూపద్దూలేని నిరంకుశాధికారం
అంతూ పంతూలేని అవినీతికి మార్గం వేసింది
భీతి ప్రీతి జాతినీ సాహితినీ

పాలించే దుస్థితి దాపరించింది
ఇదే నేటి డెమొక్రటిక్ భారతంయొక్క విషాద భారతం
కిం కర్తవ్యం? ఏవిటీ చెయ్యడం?? వాటీజ్ టు బి డన్???

ఓటంటే అయిదురూపాయల నోటుగాదు అర్ధశేరు బియ్యమూ గాదు
ఓటంటే రద్దయ్యే ప్రామిసరీ నోటుగాదు బిరియానీ పార్టీ గాదు
ఓటంటే సారా పీపాలు గాదు కల్లుముంతల తందనాలూ గాదు
ఓటంటే మూలబడ్డ గుళ్ళనీ
పాడుబడ్డ చర్చీలనీ బాగుచేయడమూ గాదు
ఓటు ప్రజాతంత్రానికీ జీవిత ప్రగతికీ రాచబాట
ఓటు ప్రజావాంఛల్ని పోలీసు ఉక్కుబూట్లతో
కాలరాసే ప్రజాద్రోహుల పాలిట పాముకాటు
ఓటు ప్రభుత్వ సీటుల్లో చోటుజేసుకొన్న నీరోలకి
వ్యతిరేకమైన చట్టబద్ధమైన తిరుగుబాటు
ఓటు గబ్బుకొట్టే వ్యవస్థలూ తినమరిగి తిరగమరిగిన
బందిపోటు దొంగలపాలిట బల్లెపుపోటు

ఎవరు ప్రజాసేవకుడో ఎవడు దారి దోపిడిగాడో
గుర్తించి ఓటు వేయండి
ఏది ధర్మమో ఏ దధర్మమో ఆలోచించి మరీ గద్దెనెక్కించండి
మనుషుల్నీ మనసుల్నీ కొని అమ్మేసే
ఈ వెను వేప విత్తుల రాజ్యంలో
మీ జీవిత సర్వస్వం నడియేట్లో మునుగుతున్న నేడు
ఎవడు పైసాతో ఓటు కొంటున్నాడో
ఎవరు ప్రజలకోసం అహర్నిశలూ
పాటుబడుతున్నారో తెలుసుకొన్ననాడు
ఈ పర్మిట్ దార్ల కంట్రాక్టర్ల లిటిగంట్ల కుక్షింభరుల
పొద్దుతిరుగుడుపువ్వుల రాజకీయ ఊసరవెల్లుల
విదేశీ సామ్రాజ్యవాదానికి అడుగులకి మడుగులొత్తుతూ
దేశాన్ని అమ్మేయ ప్రయత్నిస్తూ
దేశభక్తి బోగం వేషాలు దాల్చి ప్రజల్ని కుక్కలుగా
ప్రజాసేవకుల్ని దేశద్రోహులుగా పరిగణించే
పయోముఖ విషకుంభాల ఆటలు తక్కువ కట్టిననాడు
ఆనాడు బాగుపడుతుంది నాడు ✓

నల్లమందులాంటి గంజాయిదమ్ములాంటి
భంగు నిషాలాంటి సారాకైఫులాంటి
చేతబడిలాంటి దయ్యం భూతంలాంటి
గాఢసుషుప్తిలాంటి మూఢమత విశ్వాసంలాంటి
నేటి నిస్తేజ నిర్వీర్య ఉదాసీన చైతన్య శూన్య
నిర్లిప్తతలనుండి తిరిగి మేలుకోండి
బ్రిటిష్ సామ్రాజ్యవాద శునకాల్ని
తరిమివేసిన వీరోచిత పోరాటాలనాటి
శతకోటి భానుల ప్రభాభాసురమైన
మహోజ్వల చైతన్య విలసితులై
నలభైకోట్ల పిడికిళ్ళని వొక్కుమ్మడి బిగించి
భూనభోంతరాళాలు దద్దరిల్లిపోయేట్లు
మీ వాంఛల్ని ప్రతిధ్వనించండి
ప్రజల గోడు పెడచెవిని బెట్టి
నానా దుర్మార్గ మార్గాలు చేపట్టి
కావరం యెగదన్ని కళ్ళు మూసుకపోయి
జనత బతుకుల్ని నరక యాతనలకి గురిజేసిన
రోమన్ నీరోలు రష్యన్ జార్లు
జర్మన్ హిట్లరు ఇటాలియన్ ముసోలినీలు
ద్రౌపదీ మానభంగానికి తలపడ్డ దుశ్శాసన కీచకాధములు
దిక్కూ దివాణం లేకండా
మట్టిగొట్టుకపొయ్యి మటుమాయమయ్యారు

నిరంతర జాగరూకతే స్వాతంత్ర్యానికి చెల్లించవలసిన మూల్యం
ప్రజావాంఛకి ప్రతిబింబమైన పరమ పవిత్రమైన ఓటును
పైసాతో కొంటూ సీట్లను అమ్ముతూ
ప్రజాస్వామ్యాన్ని సజీవ నరమాంస విక్రయ
బహిరంగ వ్యాపారంగా మార్చే
మేడిపండుల అంతుతేల్చడం
అందరం నిర్వర్తించ వాలసిన పవిత్ర కర్తవ్యం
ప్రజాస్వామ్యాన్ని కాలరాసి
జనత సహనాన్ని చేతగానితనంగా భావించే యే ప్రభుత్వం
మానవ చరిత్రలో యింతదాకా మనలేదనేది
యుగయుగాలనాటి సత్యం।

# భరతవాక్యం

ఏఁవిటండీ ఇది లోకమా ?
కాక విషం కలిసిన రుచి పాకమా ?
దరిద్రుని ఆకలి అరుపే గోడు
కష్టజీవి జీవితమే బీడు
వర్గాలతోయున్న నేటి సంఘం
మానవ జీవిత ప్రతిష్టకే శృంగభంగం
మతం పేరుతో జరుగుతోన్న దారుణం
వర్ణించడానికే కఠోరం
కాబట్టి కట్టాలి కంకణాల్
విరగ్గొట్టాలి మీరుక్కు శాసనాల్
సోషలిజమే నేటి ధ్యేయం
లేకపోతే లేదు మోక్షం
వ్యష్టిస్సమిష్టితో కలిస్తే శక్తి
చీలిపోతే లేదు నరునికి విముక్తి
నిర్మించాలి వర్గరహిత సంఘ స్వర్గం
ఇదే నేటి రైటర్ యిచ్చే మహోజ్వల సందేశం.



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NPR01F356 | Date | 13/4/23 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CA1, 21, 73, | | |
| Missing Pages | NO | | |
| Prepared By | P. Jyothi | Cutting By | P. Jyothi |
| Scanned By | Swathi | Pages | 77 |
| Quality Checking | lakshmi | | |